# ఆంధ్రపత్రిక

సంవత్సర చందా
రు. 12-0-0
విడి ప్రతిక
4 అణాలు

ప్రతిబుధవారము ప్రకటింపబడును.

ఒరులేయవి యొనరించిన నరవర! యప్రియము తన మనంబున కగు దా
నొరులకు నవి సేయకునికి పరాయణము పరమధర్మపథముల కెల్లన్.
(మహాభారతము)

**Founder : K. NAGESWARA RAO.**

సంపుటము **42**
సంచిక **26**

విరోధి సంవత్సర ఫాల్గున శుద్ధ ద్వాదశి బుధవారము




నేపాల్ ప్రధాని మహారాజా షంషేర్ జంగ్ బహద్దర్ గారికి భారతప్రధాని నెహ్రూ విందు చేశారు. విందుకు అభ్యాగతులు రాజేంద్రప్రసాద్, సింహళరాయబారి, వారి సతీమణి మొదలైన ప్రముఖులంతా హాజరైనారు.

# విషయానుక్రమణిక

## 1 మార్చి 1950


| | |
|---|---|
| ముఖచిత్రం : వెలితరగలు : శ్రీ యస్. రామకృష్ణ | |
| సంపాదకీయం— | 3 |
| నేటిప్రపంచం—సూర్యనారాయణ | 5 |
| మనరాష్ట్రం : మనదేశం—సీతారామ్ | 7 |
| శిక్షాగతి—శ్రీ అంగర వెంకటకృష్ణారావు | 9 |
| రుద్రమదేవి—నోరి నరసింహశాస్త్రి గారు | 11 |
| మన ముక్కుగతి ఏమౌతుంది?— | 15 |
| "మధురభారతి" మాధవపెద్దికవి—శ్రీ పెనుమర్తి కామేశ్వరరావు | 17 |
| సినీమా— | 18 |
| భూచరజలచరాల్లో ఇంద్రియజ్ఞానం— | 20,21 |
| హైడ్రోజన్ బాంబు— | 22 |
| బాలానందం— | 24 |
| అంగారకుడు, ఇద్దరు చందమామలు—శ్రీ భైరవభొట్ల రామబ్రహ్మశాస్త్రి | 26 |
| సంగీతము—రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు | 39 |




# ఆంధ్రపత్రిక

1950–వ సం॥ మార్చినెల 1–వ తేది బుధవారము


## పాకిస్తాన్‌కు ప్రధానమంత్రి హెచ్చరిక

ప్రధానమంత్రి పండిట్ నెహ్రూ తూర్పుపాకిస్తాన్‌లో గత మూడుమాసములుగ జరుగుచున్న విషాదసంఘటనలగురించి పార్లమెంటులో యావత్తు వివరములను వెల్లడింపకపోయినను, ఆ ప్రాంతమునందు పాలకవర్గము తనబాధ్యతను ఏ విధముగ నిర్వహింపజాలకపోయినది స్పష్టముచేసెను. కొన్ని సందర్భములందు అధికారులే అల్లరులను ప్రోత్సహించినట్లు ప్రధానమంత్రి వివరించిన సంఘటనలనుబట్టి భావింపవలసివచ్చుచున్నది. ఒక్క ఢాకానగరమునందే ఆరువందలు పదివందలు మధ్య హిందువులు హత్యచేయబడిరన్న ఇతర ప్రాంతములలో జరిగిన హత్యలు ఇంతకంటె అధికముగ నున్నట్లు ఊహింపవచ్చును. ఢాకా తూర్పుపాకిస్తాన్‌కు రాజధాని. ప్రభుత్వము అల్లరులను నివారింపదలచిన, ప్రారంభమైనతరువాత అణచివేయదలచిన, అందుకు అవసరమైన సైనికబలము, పోలీసుసిబ్బంది సిద్ధముగ నుండును. పశ్చిమబెంగాల్ ప్రభుత్వమునకు సాధ్యమైనది తూర్పుబెంగాల్ ప్రభుత్వమునకు మాత్రము ఎందుకు సాధ్యము గాదు?

ఢాకావిమానాశ్రయమునకు సమీపములో సైనికశిబిర ముండియు అచట ప్రయాణీకులపై జరిగిన దురంతములను నివారించుటకుగాని, అనంతరము వారికి రక్షణలు ఏర్పాటు చేయుటకుగాని ఎట్టిప్రయత్నములు జరుగలేదన్న, తూర్పుపాకిస్తాన్ ప్రభుత్వము సంక్షోభమును అరికట్టదలచలేదని ఋజువగుచున్నది. డిసెంబరు 20, 22 తేదీలందు ఖుల్నా జిల్లాలోని దాదాపు 20 గ్రామములపై పోలీసులు జరిపిన ఘాతుకచర్యలను విచారించిన తూర్పు పాకిస్తాన్‌లో అనేక ప్రాంతములందు జరిగిన విషాదసంఘటనలకు అధికారుల ప్రోద్బలము, కుమ్మక్కు ఉన్నట్టు స్పష్టము కాగలదు. అధికారుల ప్రోద్బలముపై వారి సహకారముతో అల్లరులు జరిగిన ఫలితములు ప్రధానమంత్రి వివరించినదానికంటె విపరీతముగ నుండక తప్పదు. కనుకనే పాకిస్తాన్ ప్రధానమంత్రి విషయసేకరణసంఘనియామకమునకు గాని, భారత - పాకిస్తాన్ ప్రధానమంత్రుల జాయింటుపర్యటనకుగాని సమ్మతించియుండలేదు. ఢాకాలోని భారతీయ డిప్యూటీ హైకమిషనర్‌కు ఆ ప్రాంతములకు వెళ్లి పరిస్థితులను స్వయముగ విచారించుటకుసౌకర్యములనైన తూర్పు పాకిస్తాన్ ప్రభుత్వము కల్పించియుండలేదు. పాకిస్తాన్ ప్రభుత్వము అనుసరించిన ఈ విధానమువలన ప్రధానమంత్రి హెచ్చరించినట్లు, భారతదేశమునందు పరిస్థితులు విషమించగలవు. భారతదేశమునందలి ముస్లింలకు విశేషహాని జరుగకుండ భారతప్రభుత్వము కట్టుదిట్టములు చేయగలదని, కనుక తాము పాకిస్తాన్ నందలి హిందువులయెడల ఎట్టి విధానమును అనుసరించినను భారతదేశమునందలి ముస్లింలకు ఎట్టిప్రమాదము ఘటిల్లదని కరాచీపాలకవర్గములు భావింపవచ్చును. కాని ఈ దురంతములు నిత్యము లగుచున్నంత కాలము భారతప్రభుత్వము ఎట్టి రక్షణఏర్పాట్లు చేసినను, భారతీయులు ఉద్రిక్తులు గాకుండ చేయజాలదు. పాకిస్తాన్ ప్రభుత్వము వాంఛించునదికూడ అదియే కావచ్చును.

పండిట్ నెహ్రూ ప్రకటించినట్లు తూర్పు బెంగాల్ సంఘటనలకు, కాశ్మీర్ వ్యవహారమునకు అవినాభావసంబంధము గలదు. వేసవి సమీపించుటతో

పాకిస్తాన్ కాశ్మీర్లో తిరిగి యుద్ధచర్యలను సాగించుటకు సిద్ధమగుచున్నది. భారతప్రభుత్వము తన యావత్తు బలమును కాశ్మీరునందు కేంద్రీకరించి పాకిస్తాన్ విజృంభణమును అరికట్టుటకు వీలుగాకుండ దేశమంతటను అల్లరులను ప్రోత్సహించుట పాకిస్తాన్ సంకల్పమని స్పష్టమగుచున్నది. భారతీయులను రెచ్చగొట్టి అరాచక పరిస్థితులను కల్పించుటకు పాకిస్తాన్‌కు ఇంతకంటే వేరు సాధనము లేదు.

భారతీయులు తూర్పుపాకిస్తాన్ సంఘటనలకు ఉద్రిక్తులై ప్రతీకారచర్యలకు పూనుకొనిన పాకిస్తాన్ సంకల్పము సిద్ధించును. పాకిస్తాన్‌నందలి హిందువులను రక్షింపలేకపోవుటే గాక భారతప్రభుత్వమును బలహీన మొనర్చి పాకిస్తాన్ ప్రభుత్వమును బలపరచిన వారు కాగలరు. పాకిస్తాన్ ప్రభుత్వము తన ప్రస్తుత విధానమును మార్చుకొనదు. దేశమున శాంతిభద్రతల రక్షింపగల తాహతు, సామర్థ్యము పాకిస్తాన్ ప్రభుత్వమునకు లేదు. పండిట్ నెహ్రూ తెలిపినట్లు ఏప్రభుత్వమునకైనను తన పౌరులను రక్షించుకొనుట కనీస ధర్మము. పాకిస్తాన్ ప్రభుత్వము ఆ కనీసధర్మమునే నిర్వర్తింపజాలకున్నది. తన అసమర్థతను కప్పిపుచ్చుకొనుటకు పాకిస్తాన్ ప్రభుత్వము ఎట్టి దుశ్చర్యలకైనను వెనుదీయుట లేదు.

పాకిస్తాన్ ప్రభుత్వము భారతప్రభుత్వసూచనలను అంగీకరించి పరిస్థితులను చక్కచేయుటకు పూనుకొనకున్న భారతప్రభుత్వము వేరుమార్గములను విచారింపవలసియుండునని పండిట్ నెహ్రూ చేసిన ప్రకటన భారతీయులకు, పాకిస్తాన్‌లో వున్న హిందువులకు తృప్తికరముగ నుండగలదు. పాకిస్తాన్ దురాగతములను భారతప్రభుత్వము ఎంతోకాలము సహింపదని పండిట్ నెహ్రూప్రకటన స్పష్టము చేసినది. ఈపరిస్థితులలో భారతీయులు ఉద్రిక్తులు గాక పాకిస్తాన్‌ను ఎదుర్కొనుటలో భారతప్రభుత్వముతో సహకరించి ప్రభుత్వవిధానమును బలపరచవలసి యుండును.



నేటి ప్రపంచం:

# తూర్పుబెంగాల్లో హిందువులపై అత్యాచారాలు, పాకిస్తాన్ కుట్ర

## కాశ్మీర్ సమస్యపై భద్రతామండలి కొత్తతీర్మానం

పాకిస్తాన్ భారతదేశాలమధ్య వైషమ్యాలు మితిమీరి ప్రమాదపరిస్థితి ఏర్పడింది. తూర్పుబెంగాల్‌లో మహమ్మదీయులదారుణచర్యలకీ కాశ్మీర్ సమస్యకి సన్నిహితసంబంధం ఉందని భారతప్రధాని పండిట్ నెహ్రూ పార్లమెంటులో అన్నారు.

ఉభయదేశాల్లోనూ నానాటికీ ప్రబలమౌతున్న విరోధభావాన్ని తొలగించి శాంతిని కాపాడ్డానికి, ఉభయదేశాల్లోని అల్పసంఖ్యాకవర్గాలకీ రక్షణావకాశం ఇవ్వడానికి ఉభయప్రభుత్వాలూ యుద్ధానికి దిగబోవని ప్రకటించాలని పండిట్ నెహ్రూ పాకిస్తాన్ ప్రభుత్వానికి సూచించారు. కాని పాకిస్తాన్ ప్రభుత్వం నిరాకరించింది. ఇదిగాక కాశ్మీరాన్ని సాధించడానికి ప్రజలు, యుద్ధానికీ త్యాగానికీ సంసిద్ధులై ఉండాలని పాకిస్తాన్‌లో ముస్లింనాయకులు ప్రజల్ని ఉద్బోధిస్తున్నారు. ఇటు తూర్పుపాకిస్తాన్‌లో ముస్లింనాయకులు, అల్పసంఖ్యాకులైన హిందువులపైన రెచ్చగొట్టారు. మహమ్మదీయులు అక్కడ హిందువులపైన అమానుషంగా అత్యాచారాలు జరుపుతున్నారు. ఈ అత్యాచారాలకు హేతువు తమ దుష్ప్రచారం కాదనీ కలకత్తాలో మతకలహాలే హేతువనీ పాకిస్తాన్ ప్రభుత్వం చెప్తోంది. వాస్తవానికి ఇటువంటి మతకలహాలు, కల్లోలం భారతదేశంలో రెచ్చగొట్టాలని పాకిస్తాన్‌నాయకుల ప్రయత్నం. భారతదేశంలో మతకలహాలను రెచ్చగొట్టినట్లయితే ఇక్కడున్న నాలుగుకోట్లమంది మహమ్మదీయులు ఇక్కడ పరిపాలనను స్తంభింపచేయగలరని పాకిస్తాన్ విశ్వాసం. అదేసమయంలో "ఆజాద్ కాశ్మీర్" సైన్యాల్ని, సరిహద్దుప్రాంతంలోని పఠాన్లని కాశ్మీరం పైకి రెచ్చగొట్టవచ్చును. అప్పుడు పాకిస్తాన్ ప్రభుత్వం తమ బాధ్యతేమీ లేనట్లు నటించి పఠాన్లనీ, పాకిస్తాన్ సైనికదళాల్నీ కాశ్మీరంలో "అల్లరుల్ని అణచే" మిషతో దాడి పంపిచ్చవచ్చును. భారతదేశంలో అంతఃకలహాలు చెలరేగినట్లయితే భారతప్రభుత్వం కాశ్మీరంలో ఓడిపోవచ్చునని, వీలైతే అస్సాం, బీహార్, తూర్పుపంజాబ్‌లపైకి దాడిమూకల్ని పంపవచ్చుననీ పాకిస్తాన్ ప్రభుత్వం ఆశ. భారతప్రభుత్వం పాకిస్తాన్‌లో నాయకుల ప్రచారాన్ని ఇదివరకే కనిపెట్టి, అన్ని ప్రమాదాల్నీ ఎదుర్కోడానికి సిద్ధపడింది. భారతదేశంలో మతకలహాలు సంభవించకుండా కాపాడగలిగింది. కాని తూర్పుబెంగాల్ నుంచి వచ్చిన వేలాది హిందువులవల్ల అక్కడ మహమ్మదీయులు జరుపుతున్న దురంతాలు తెలిసివచ్చాయి. తూర్పుపాకిస్తాన్ ప్రభుత్వం మతకలహాలను అణచడానికి ప్రయత్నించలేదుసరిగదా అనేక చోట్ల పోలీసులు, ముస్లింజాతీయసైనిక దళాలే స్వయంగా అత్యాచారాలు జరిపారు.

ఈ అత్యాచారాల సమాచారం వ్యాపించగానే కలకత్తాలో అక్కడక్కడ కలహాలు చెలరేగినమాట నిజమే. కాని కలకత్తాలో కూడా కలహాలు ప్రారంభమవడానికి మహమ్మదీయులే మూలకారకులైనారు. అయితే ప్రభుత్వం వెన్వెంటనే కలహాలను అణిచివేసింది. కలకత్తాలోనూ, పశ్చిమబెంగాల్‌లోనూ హిందువులు మహమ్మదీయులమధ్య సఖ్యతను కాపాడగలుగుతోంది. పశ్చిమబెంగాల్‌లో అక్కడక్కడ సంభవించిన కలహాలకు కొద్దిమంది హిందువులు మహమ్మదీయులు కూడా కారకులైనప్పటికీ, హిందువులలోనూ, మహమ్మదీయులలోనూ అత్యధికసంఖ్యాకులు సఖ్యతతోనే ఉన్నారు. భారతదేశంలో మతంతో నిమిత్తంలేకుండా సర్వవర్గాలవారికీ న్యాయంసమంగా చేకూరుతున్నదనీ, ప్రభుత్వాన్ని విశ్వసించవచ్చుననీ దేశంలో అన్నిమతాలవారికీ స్థిరవిశ్వాసం కలిగింది. నాలుగుకోట్లమంది మహమ్మదీయుల్లోనూ ఏకొద్దివేలమందో తప్ప మిగతావారందరూ పాకిస్తాన్ దుష్ప్రచారానికి చెవియొగ్గరు.

పాకిస్తాన్‌లో ఏడుకోట్ల ప్రజల్లో దాదాపు రెండుకోట్లమంది హిందువులున్నారు. వీరిలో కొన్ని లక్షలమంది దేశవిభజనానంతరం భారతదేశానికి తరలివచ్చేశారు. భారతదేశంనుంచి పాకిస్తాన్ తరలివెళ్లిపోయిన మహమ్మదీయులసంఖ్య వారిలో మూడోవంతుకూడా ఉండరు. రెండుకోట్లమందిలోనూ పారిపోగా మిగిలినవారిలో నాలుగింట మూడువంతులు హిందువులు తూర్పుబెంగాల్‌లో ఉన్నారు. భారతదేశంలో మహమ్మదీయులకు భారతప్రభుత్వంపట్ల విశ్వాసం ఉంది. కాని పాకిస్తాన్‌లో హిందువులకు పాకిస్తాన్ ప్రభుత్వం రక్షణ ఇవ్వలేకపోగా వారినందరినీ శత్రువులుగా పరిగణించి వారి మానవిత్తప్రాణాల్ని కొల్లగొట్టుతున్నారు. పాకిస్తాన్‌లో హిందువులకు ప్రభుత్వంపట్ల భక్తిలేదనీ, అన్యదేశాలను మాతృభూమిగా పరిగణించేవారికి - పాకిస్తాన్‌లో తావులేదనీ పాకిస్తాన్ మంత్రులంటున్నారు. హిందువుల్ని రక్షించకపోగా మహమ్మదీయుల్ని వారిపైకి పురిగొల్పినప్పుడు హిందువులకు ప్రభుత్వంపట్ల విశ్వాసం నశించడంలో ఆశ్చర్యం లేదు. వాస్తవానికి అక్కడ హిందువులపైన అత్యాచారాలు జరిపి, భారతప్రభుత్వాన్ని సాధించి రాజకీయప్రయోజనాలు నెరవేర్చుకోవాలని పాకిస్తాన్ యత్నిస్తోంది.

దేశవిభజనవల్ల మతభేదాలు వైషమ్యాలు పరిష్కారం కావనే సత్యం తిరిగి రుజువౌతున్నది. కాని ఎన్నిలక్షలమంది హిందూ మహమ్మదీయుల ప్రాణాలు దారుణహత్యలకు పాలైనప్పటికీ, అన్యదేశాలే పి

(ముఖ్యంగా బ్రిటన్ అమెరికాలు) ఈ సత్యాన్ని అంగీకరించదలుచుకోనట్లు కనిపిస్తుంది. భద్రతామండలిలో కాశ్మీర్ సమస్య చర్చసందర్భంలో ఈవిషయం స్పష్టంగా బోధపడుతున్నది.

మతం ఆధారంపైన బెంగాల్ రాష్ట్రాన్ని విభజించడంలో ఈ సత్యం మరింత స్పష్టపడుతున్నది. బెంగాల్ విభజనఅనంతరం ఉభయఖండాలలోనూ రెండోమతంవారి సంఖ్య అధికంగానే ఉండిపోయింది. తూర్పుబెంగాల్‌లో నాలుగుపంతుల మంది మహమ్మదీయులకు మూడుపంతుల మంది హిందువు లుండిపోయారు.

పశ్చిమబెంగాల్లో నాలుగుపంతులమంది హిందువులకు మూడుపంతులమంది మహమ్మదీయు లుండిపోయారు. జాతిమతభేదాల ఆధారంపైన రాజ్యాలస్థాపన ఈవిధంగా జరగడంవల్ల నిత్యకలహాలు యుద్ధాలు తప్పవనే సత్యానికి తూర్పుయూరప్ చరిత్రే తార్కాణం. తూర్పుబెంగాల్, పశ్చిమబెంగాల్ రెండు భిన్నరాజ్యాల అధీనంలో ఉండటంవల్ల ఉభయరాజ్యాలమధ్య యుద్ధాలు అనివార్యం కాగలవు. అందువల్లనే తూర్పుబెంగాల్ భారత రిపబ్లిక్‌లో కలిసిపోతేగాని బెంగాల్లో మతకలహాలను తుదముట్టడించడం అసాధ్యమని శ్రీశరత్ చంద్రబోస్ తమ తుది సందేశంలో అన్నారు. మతం ఆధారాలపై జాతిభిన్నమౌతుందని వాదించే పాకిస్తాన్ నాయకుల వాదంప్రకారమే ఇదొక్కటే పరిష్కారమార్గం.

భారతదేశంలో అంతఃకలహాల్ని రెచ్చగొట్టి భారతప్రభుత్వాన్ని లొంగదియ్యకల్గినట్లయితే పాకిస్తాన్ పొరపడుతోంది. భారతదేశంలో మహమ్మదీయుల్లో అత్యధికసంఖ్యాకులు భారతప్రభుత్వానికే తోడ్పడగలరని వారి ప్రకటనవల్ల ధృవపడుతోంది. సింధు, పంజాబ్, కాశ్మీర్, తూర్పుబెంగాల్ ప్రాంతాలనుంచి పాకిస్తాన్ సైన్యాలు ఒక్కపెట్టున దాడి చేసినా వారికి గుణపాఠం చెప్పడానికి తగిన బలం భారతసైన్యాలకుంది. భారతప్రభుత్వం సంసిద్ధంగానే ఉంది.

## భద్రతామండలిలో కాశ్మీర్ సమస్య:

ఒకవంక కాశ్మీర్‌లోనూ తూర్పు, పశ్చిమ పాకిస్తాన్లలోనూ పాకిస్తాన్ ప్రభుత్వం యుద్ధసన్నాహాలు చేస్తుండగా భద్రతామండలిలో కాశ్మీర్ సమస్యపైన తిరిగి పాత పాటే ప్రారంభమయింది. ఈమారు భద్రతామండలి అధ్యక్షుడైన క్యూబా ప్రతినిధి డా॥ కార్లస్ బ్లాంకో ఒక తీర్మానం ప్రవేశపెట్టాడు. ఇదివరలో భారతప్రభుత్వం నిరాకరించిన మెక్నాటన్ ప్రతివాదనల్లో సూచించబడిన ప్రకారం కాశ్మీరంలో సైన్యాల్ని అయిదు మాసాల్లో ఉపసంహరించుకోవాలని ఈ తీర్మానం పాకిస్తాన్ భారతప్రభుత్వాలకు ఆదేశిస్తున్నది. ఇదివరలో భద్రతామండలి వారి తరఫున మధ్యవర్తిత్వం నెరపిన కాశ్మీర్ కమిషన్ రద్దుపరిచి, మధ్యవర్తిగా ఒకరిని నియమించాలని తీర్మానం సూచిస్తున్నది. కాశ్మీరంనుంచి సైన్యాల ఉపసంహారణను ఈమధ్యవర్తి అజమాయిషీ చేస్తారు. జనవాక్యనిర్ధారణ ఎప్పుడు జరపవలసినదీ ఈమధ్యవర్తి నిర్ణయిస్తాయి. ఉభయప్రభుత్వాలూ మధ్యవర్తినియామకానికి అంగీకరించిన మాసంలో నియామకం జరుగుతుంది.

ఈతీర్మానాన్ని బ్రిటిష్, అమెరికన్ ప్రతినిధులు బలపరిచారు. చీనా ప్రతినిధి ఉపన్యాసంలో ఏమిచెప్పినా తీర్మానానికి సుముఖత ప్రకటించాడు.

ఈతీర్మానంపై చర్చలో మాట్లాడుతూ బ్రిటిష్ ప్రతినిధీ సర్ అలెగ్జాండర్ 'కెడూగన్ మెక్నాటన్ ప్రతిపాదనలు న్యాయమైన' వన్నాడు. నిర్భయంగా ధర్మమని తలిచే విషయాన్నే సమర్థించాలని చెప్తూ, మరొకవంక గతాన్ని త్రవ్వి న్యాయాన్యాయాలను తరచి లాభం లేదన్నాడు బ్రిటిష్‌ప్రతినిధి. వాస్తవంగా కాశ్మీరంపైని పాకిస్తాన్ సైనికుల్ని పురిగొల్పినది బ్రిటిష్‌సేనానే అని పాకిస్తాన్ విదేశాంగమంత్రి సర్ జఫ్రుల్లాఖాన్ ఇదివరలో చర్చలో వెల్లడిపరిచాడు. ఈ విషయాన్ని కమ్మకోడానికే గతాన్ని చర్చించవలసిన పనిలేదని బ్రిటిష్‌ప్రతినిధి అంటున్నాడు. బ్రిటిష్‌వారి తంత్రాల్ని లోకం ఎరక్కపోదు. కాని ఇప్పుడు తాను న్యాయమని తలచిన పక్షాన్ని సమర్థిస్తానని చెప్తూ మెక్నాటన్‌ప్రతిపాదనల్ని సమర్థించే బ్రిటిష్‌ప్రతినిధి అవినీతి, నిర్లజ్జ బోధపడుతున్నాయి.

అమెరికన్ ప్రతినిధి ఎర్నెస్ట్ గ్రాస్ కూడా మెక్నాటన్‌ప్రతిపాదనల్ని భారతప్రభుత్వం నిరాకరించినందుకు చింతిస్తూ, క్యూబాతీర్మానాన్ని అంగీకరించడం అవసరమని చెప్పాడు.

అయితే భద్రతామండలిలో ఈ తీర్మానానికీ చర్చకీ ఎంత విలువ ఉంటుందో చెప్పడం కష్టం. మండలిసమావేశాలలో రష్యా పాల్గొనకపోయినప్పటికీ, మిగతా సభ్యులతోనే వ్యవహారాలు సాగించడానికి మిగతా ప్రభుత్వాలు అంగీకరిస్తున్నాయి. భారతప్రభుత్వం, పాకిస్తాన్ కూడా రష్యా రానందుకు అంతగా పాటించడం లేదన్న మాట. చర్చనీయాంశం భారతదేశానికి సంబంధించినదికాబట్టి మండలిలో సభ్యత్వమున్నప్పటికీ భారతప్రతినిధికి తీర్మానంపైన వోటుచేసే హక్కుండదు. మిగతా ఏడుగురు ప్రతినిధుల్లో ఏడుగురు క్యూబాతీర్మానానికి సుముఖంగా ఉన్నట్లు లేక 'నిక్సన్ వార్తలు' తెలుపుతున్నాయి. అంటే ఈ తీర్మానం భద్రతామండలిచే ఆమోదించబడే అవకాశం ఉందన్నమాట. ఈ తీర్మానం మెక్నాటన్ ప్రతిపాదనల ననుసరించే ఉంది. కాబట్టి, పాకిస్తాన్ అంగీకరించడానికి అభ్యంతరం ఉండదు. ఇంక భారతప్రభుత్వానికి ఈ తీర్మానాన్ని అంగీకరించడం సాధ్యం కాకపోవచ్చును.

## బ్రిటిష్ ఎన్నికలు:

బ్రిటన్‌లో ఫిబ్రవరి 23 వ తేదీని జరిగిన ఎన్నికల్లో తిరిగి కార్మికపక్షానికే విజయం లభించింది. అట్లీయే ప్రధానిగా ఉంటాడు. కాని ఇంతకుముందు పార్లమెంటులో వారికి కన్సర్వేటివ్ పార్టీకంటె 180 మంది సభ్యులు అధికంగా ఉన్నందువల్ల ముఖ్యపరిశ్రమల్ని జాతీయంచేసే కార్యక్రమంలోనూ, ఉచిత వైద్యసౌకర్యాలేర్పరచే కార్యక్రమంలోనూ, రేషనింగు, కంట్రోల్స్ కఠినంగా విధించడంలోనూ అట్లీప్రభుత్వానికే ఆటంకం కలగలేదు. కాని ఇప్పుడు పార్లమెంటులో వారి సంఖ్య తగ్గిపోయింది. 625 మంది మొత్తం సభ్యులుండే పార్లమెంటులో వారికిప్పుడు 315 స్థానాలే లభించాయి. ఇంక

(37-వ పేజీ చూడుడు)

మన రాష్ట్రం, మన దేశం:

# కాంగ్రెస్ నిర్మాణంలో సవరణ

# భారతదేశంలో రైల్వేలు

కాంగ్రెస్ కమిటీలకు ఎన్నికవిధానాన్ని అఖిలభారత కాంగ్రెస్ కమిటీ సవరణచేసింది. కాంగ్రెస్ కార్యదర్శి శ్రీకళా వెంకట్రావుగారు ఆ సవరణగురించి వివరణ చేశారు. పావలా చెల్లింపుతో సభ్యత్వానికి అర్హత సాధించుకొంటున్న అనేకకాల కాంగ్రెస్‌వాదుల్ని మహాత్మాగాంధీజీ, కాంగ్రెస్‌సంస్థనిర్మాణాన్ని సంస్కరించాలని యోచించి, కేవలం సేవాధర్మంపైనే కాంగ్రెస్ పంథను నిర్మించాలనుకున్నారు. అయితే లోకసేవాసంఘంనివేదికపై వారి యత్నం సఫలీకృతం కాకముందే గాంధీజీ దేహాంతరగతులైనారు. తరవాత గాంధీజీ కోరికను మన్నించి నాయకులు కాంగ్రెస్ నిర్మాణాన్ని సవరణ చేశారు. లోకసేవాసంఘాశయాన్ని సాధించడానికి, రాజకీయసంస్థగా కూడా పని చెయ్యడానికి ఈ సంస్కరణ ఉద్దేశించబడినాయి.

రుసుము చెల్లించనక్కరలేకుండానే కాంగ్రెస్ పక్షంపట్ల అభిమానంకలవారందరూ కాంగ్రెస్‌లో ప్రాథమికసభ్యులుగా చేరవచ్చును. కాంగ్రెస్ కార్యక్రమాల్ని, ఖద్దరుధారణ మొదలైన నియమాల్ని పాటించేవారు కొంత రుసుముకట్టి అర్హసభ్యులు (క్వాలిఫైడ్ మెంబర్స్)గా చేరవచ్చును. కాంగ్రెస్ నిర్మాణకార్యక్రమంలోని 14 అంశాలలో ఏదో కొన్ని నిర్మాణాత్మకంగా అమలుపరిచే అర్హసభ్యులు మాత్రమే కార్యకర్తలుగా (ఎఫెక్టివ్ మెంబర్స్) చేరవచ్చును.

ప్రతిప్రాంతంలోనూ కాంగ్రెస్ పంచాయితీలకు అర్హసభ్యులనుంచి కొందరిని ప్రాథమికసభ్యులు ఎన్నుకోవాలి. ఎన్నుకొనబడిన ఈ పంచాయతీసభ్యులు, సమర్థసభ్యులు కలిసి తాలూకా, జిల్లా,



ఫిబ్రవరి 18-వ తేదీన కాన్‌స్టిట్యూషన్ హాల్‌లో జరిగిన అఖిలభారత కాంగ్రెస్ కమిటీ సమావేశంలో: నెహ్రూ, పటేల్, పంత్, ఆజాద్ మొదలైన అగ్రనాయకులు.

రాష్ట్ర కాంగ్రెస్ సంఘాలకు సమగ్రసభ్యులలోనివారిని ఎన్నుకోవాలి.

కాని ఈ మూడుతరహాల సభ్యుల్ని చేర్చడంలోనూ ఆంధ్రరాష్ట్రంలో అక్రమం జరిగింది. మొత్తం భారతదేశంఅంతటా చేర్చుకోబడిన 14 లక్షల మంది సమగ్రసభ్యులోనూ 9 లక్షలమంది ఆంధ్రరాష్ట్రంలోనే చేర్చబడ్డారట. గుంటూరుజిల్లాలో మంత్రి వర్గపక్షం విరోధికాంగ్రెస్ పక్షాలవారూ పోటీపడి దాదాపు 4 లక్షలమంది చేర్చారు. రుసుమును సభ్యులు చెల్లించకుండా సభ్యుల తరఫున ముఠాలనాయకులే చెల్లించారట. ఈసభ్యుల అర్హత అనర్హతలు నిర్ణయించడం దుర్ఘటమైపోయింది. అందువల్ల కాంగ్రెస్ కార్యవర్గం అఖిల భారత కాంగ్రెస్ కమిటీని సమావేశపరిచి ఈపరిస్థితిని చర్చించి కాంగ్రెస్ నిర్మాణంలోను సవరణ తెచ్చారు.

కాంగ్రెస్ కమిటీల ఎన్నికల్లో అనర్హ సభ్యుల వోటింగ్ హక్కును రద్దుపరిచారు. అర్హసభ్యుల నుంచి సభ్యుల్ని కాంగ్రెస్ కమిటీలకు ఎన్నుకోవలసినది. కాంగ్రెస్ పంచాయతీదార్లని నిర్ణయించబడింది.

అయితే ఈ సవరణవల్ల ఎంతవరకూ ప్రయోజనం ఉంటుందనే విషయం సంశయనీయం. సమగ్రసభ్యులుగా లక్షలకొద్దీ జనం చేరడంవల్ల ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్‌కు రుసుము ధనంమాత్రం మిగిలింది. కాంగ్రెస్ కమిటీల ఎన్నికలకి నిలబడ్డానికి సమగ్రసభ్యులు పోటీపడితే ఎన్నికల ఖర్చు ఎలాగూ హెచ్చుకతప్పదు. ఇప్పుడు పంచాయతీదార్లు కొద్దిమందే కాబట్టి వారి ప్రాపుకోసం వారెక్కువౌతారు. మున్ముందు కాంగ్రెస్ సర్వసభ్యసమావేశం పరిస్థితినంతనీ, తిరిగి పరిశీలించవలసిన అవసరం ఉంటుంది.

కాంగ్రెస్ సర్వసభ్యసమావేశం 1950 జూన్‌లోగాని జూలైలోగాని జరపడానికి కూడా అఖిలభారత కాంగ్రెస్ కమిటీ నిర్ణయించింది. మద్రాసులోనో బెంగుళూరులోనో సమావేశం జరుగుతుంది. ఆంధ్రదేశంలో సమావేశం జరగవలసిన అవకాశం ఉన్నది కాస్తా అంతరించింది.

## రైల్వే బడ్జెట్ :

భారతరిపబ్లిక్ పార్లమెంటులో మంత్రి శ్రీయన్. గోపాలస్వామి అయ్యంగార్ ఫిబ్రవరి 21 వ తేదీని రైల్వే బడ్జెట్ ప్రతిపాదించారు. ఈ బడ్జెట్ ముఖ్యమైన విషయం ఏమిటంటే, టిక్కట్ల రేట్లు హెచ్చించరు. గతసంవత్సరం హెచ్చింపులమూలంగా గడిచిన సంవత్సరం ఖర్చుపైన ఆర్జన రు 11 కోట్ల 2 లక్షలు అధికంగా వచ్చింది. ముందు సంవత్సరం రు 14 కోట్ల 1 లక్ష లాభం వస్తుందని అంచనా వెయ్యబడింది. రానున్న సంవత్సరం ఆదాయం రు. 232 కోట్ల 50 లక్ష లుంటుందనీ, ఖర్చు రు. 218 కోట్ల 49 లక్ష లుంటుందనీ అంచనా వెయ్యబడింది. గడచిన సంవత్సరం రు 225 కోట్ల 15 లక్షలు ఆదాయం వచ్చింది. రు. 214 కోట్ల 13 లక్షలు ఖర్చయింది.

రైల్వేల ఆర్థిక పరిస్థితి చక్కబడిందని మంత్రి గోపాలస్వామి అయ్యంగార్ చెప్పారు. ప్రయాణీకులరద్దీ, సరుకులరవాణా రద్దీలకు తట్టుకోగలిగాయన్నారు. రైళ్లలో పూర్వమున్నంత ఒత్తిడి తగ్గినా, ఇప్పటికీ ప్రయాణం కష్టంగానే ఉంది. సరుకుల రవాణా మాత్రం చాలా మేలు.

ఈమారు బడ్జెట్‌లో గమనించదగిన మూడు ముఖ్య విశేషాలున్నాయి.

1. సంస్థానాల్లోని రైల్వేలన్నీ భారత ప్రభుత్వంఅధీనంలోకి వచ్చాయి. 1950 ఏప్రిల్‌తో భారతరిపబ్లిక్‌లో రైల్వేఅంతా భారతప్రభుత్వనిర్వహణలోకి వచ్చేస్తుంది. మొత్తం సంస్థానాల్లోని 7560 మైళ్ల పొడవు రైల్వే కలిసి భారతప్రభుత్వంనిర్వహణలోని రైల్వే పొడవు మొత్తం 33,084 మైళ్లవుతుంది.

2. రైల్వేశాఖ రెవిన్యూప్రభుత్వ రెవిన్యూఫండ్‌ల మధ్య వ్యవహారాలను కొత్త రీతిని నిర్వహిస్తారు. దీనివల్ల రైల్వేఅభివృద్ధి కార్యక్రమాలు సులభసాధ్యం కాగలవని మంత్రిగారు చెప్పారు.

3. చిత్తరంజన్‌వద్ద రైల్వేఇంజనులు తయారుచెయ్యడానికి పెద్దపరిశ్రమ స్థాపించబడింది.

అస్సాంకు రైల్వేమార్గం నిర్మించబడింది. ఇదిగాక భారతదేశంలోనే రైల్వేబోగీలు, నాగనులు నిర్మిస్తున్నారు.

ప్రయాణీకుల సౌకర్యలనభివృద్ధి చెయ్యడానికి కోటీ 75 లక్షల రూపాయలీ సంవత్సరం ప్రత్యేకించబడిందని కూడా మంత్రిగారు తెలియపరిచారు. గతసంవత్సరం ప్రత్యేకించబడినది కోటీ 50 లక్షల రూపాయలు.

రాయలసీమలో రైల్వేరవాణా అభివృద్ధికి ఎట్టి యత్నమూ జరక్కపోవడం ఆంధ్రదేశానికి అశాభంగం కలిగించింది. యుద్ధకాలంలో నిలిపివేయబడిన మార్గాల్ని పునరుద్ధరించడంలో కూడా ఆంధ్రదేశానికి అన్యాయమే జరిగింది. ఈ అన్యాయానికి బాధ్యత కేవలం మద్రాసుప్రభుత్వంపైనే ఉంది. రైల్వేమార్గాల పునరుద్ధరణలో తమిళ్నాడులోని అవసరాలను క్రమక్రమంగా తీర్చుకుంటున్నారు. అవసరవస్తువుల రవాణా అవసరాలదృష్ట్యా మద్రాసుప్రభుత్వం ముందు ప్రతిపాదిస్తేనే భారతప్రభుత్వ రైల్వేశాఖవారు నిర్వహిస్తారు. మద్రాసు ప్రభుత్వం ఆంధ్రదేశంలోని అవసరాలు తొక్కిపెట్టి తమిళ్నాడులోని అవసరాలను ప్రతిపాదిస్తున్నంతవరకూ మనదేశంలో రైల్వే రవాణాపరిస్థితిఎప్పటిమాదిరిగానే ఉంటుంది.

## ఆహార సమస్య :

చెన్నరాష్ట్రంలో ఆహారసమస్య గురించి భారతప్రభుత్వం అధికశ్రద్ధ వహించి, ఈ రాష్ట్రానికి అనుకున్నదానికంటె ధాన్యాన్ని అధికంగానే సప్లై చెయ్యగలరని వాగ్దానమిచ్చారు. ఆంధ్రదేశంలో తుపానువల్లనే గాక తమిళ్నాడులో అనావృష్టివల్ల పంటలు పాడై ఫలసాయం తగ్గిపోయిందని మద్రాసుప్రభుత్వం ప్రకటించింది. ఈసంవత్సరం 9 లక్షల టన్నులు కొరవౌతుందన్నారు. భారతప్రభుత్వం మొదట నాలుగులక్షల టన్నులు సప్లై చెయ్యడానికి నిర్ణయించారు. తరవాత వీలునుబట్టి సప్లై హెచ్చించగలరని వాగ్దాన మిచ్చారు.

పంటధాన్యం ఇంటికి వచ్చిన కొద్దిమాసాల్లోనే దక్షిణాదిన కరువువచ్చిందని గగ్గోలు పడ్డారు. ఢిల్లీలో ఆహారశాఖోద్యోగుల సమావేశసమయంలో ఈ కరువుమాట విన పడింది. ఆతరవాత మళ్లీ వినపడలేదు. కాని ఆంధ్రదేశంలో తుపానువల్ల బాధితుల సహాయార్థం చేర్చబడిన గవర్నరునిధి దక్షిణాదిన కరువుమీదపైన వినియోగపరచబడినట్లు వదంతులు వ్యాపించాయి.

ధాన్యసేకరణవిధానంలో ఒక సౌకర్యాన్ని ప్రభుత్వం ఏర్పాటుచేస్తున్నది. ఎవరివద్ద ప్రభుత్వాధికారులు ధాన్యం సేకరిస్తున్నారో, వారికి ఏయే అవసరాలకు ఎంతెంత ధాన్యం విడిచిపెట్టి, ఎంత ధాన్యం సేకరిస్తున్నారో జాబితాలు వ్రాసి యజమానులకు నకళ్ళు ఇస్తారు. ధాన్యసేకరణ విధానంలో ప్రభుత్వం గతసంవత్సరం ప్రజల ఫిర్యాదుల్ని గుర్తుంచుకుని సవరణలు తేవలసిన అవసరం ఉంది. [సీతారాం]

పూరించెన్ ప్రణయామృతంబు మహతిక్
పొందైన నీకాగిలిన్
దారింపన్ విడదేని శోకధుని శ
బ్దంబుల్ ప్రసారించెడిన్
స్త్రీలు : ఇవి చిరుగంటల రవరవలా?
పు : ఇవి సెలయేరుల గలగలలే!
స్త్రీ : ఇది హృదిదాహక పావకమా ?
పు : ఇది మందారారుణిమంబే!
స్త్రీ : ఇది హాలాహలవర్ణంబా?
పు : ఇది చంద్రాతపవర్ణంబే!
స్త్రీ : అది గదిగో భావజతురగ!
మ్మొగజిమ్మెడి పుష్పపరాగం!
పతగాద్భుతఘోటకహేషం
ప్రక్రాంతితపమరవిఘోషం!
పు: నవనాడులు గుబగుబపొంగే
నవయవ్వనసాధనయుతులై
నవయువతీయువకుల్లారా
బవరముకై పరువెత్తండోయ్!
అందరూ: అదిగదిగో అరదధ్వానం
అది మానుల కందని జ్ఞానం!
అది వలపుల మణుల ప్రవర్షం
అది మూర్ఖుల కందని యమృతం
అదిగదిగో మీనపతాకం
అది యువజనవిజయపతాకం
(ఆసమయంలో ధూర్తమతి సౌదామిని ఒకమూలనుంచి అడ్డువచ్చి)—
ధూర్తమతి: కన్నులుమూసి మీరు కల
కాలము గ్రుడ్డిగ పోవనెంతురే
యన్నలు చెల్లెలార! మన
మందర మొక్క విధాన నుండగా
నెన్నడు లేని వింత యిది
యెక్కడి శాస్త్రము! ఒక్క రోజుమా
యన్నలు లేక చెల్లియల
హా! జరిపింతురె యుత్సవంబులన్
ఈవిశ్వంభరమెల్ల సంగతుల జా
తీగీతిభేదంబులక్
గావింపం జనబోదు పుష్పములు రా
కాచంద్రుడున్ కిరణముల్
భావంబందున భేదమెంచవన పు
ల్లంబంద కాంతింపగా
రావంబుల్ పచరింపగా? ప్రణయ మం
త్రంబొండె ఏజాతికిన్
వయసుమళ్లినగురుడు బూజయినబుద్ధి
ఆడను మగను మధ్యగా గోడపెట్టి
తలలువంచిన విద్యార్థితమ్ములార
లెండు మన హక్కు నిలబెట్టరండు రండు!
నమ్రమతి:
అగుము తమ్ముడా గురువు
లానతిదాటిన చెడ్డచేతురున్
ధూర్తమతి:
హో! గురు వెవ్వడిందు మన
పొందును జేటుగ; నుత్సవంబులున్
సాగవలెన్ సమానముగ
నాపురుషాంగనభేదరీతిగా
సాగనిపక్షమందుకొన
సాగవు యుత్సవకార్యసంగతుల్!
పెద్దకలవరం బయలుదేరుతుంది. అదివిని కళాకోవిదుడు వచ్చి సంగతులన్నీ తెలిసికొంటాడు.
కళాకోవిదుడు:
సత్యంబున్ వచియింతు ధూర్తమతి హ
ర్షంబైన స్త్రీపూర్వ సాం
గత్యం బొక్కగిరిం దలిర్చవలె; ల
క్ష్యం బేది కన్యామణియా
జాత్యంతర్దితతారతమ్యమును సం
స్కారంబు లేనట్టి నీ
యత్యాచారము నీ వినాశమును సా
యంబౌను సుమ్మాటికిన్
నమ్రమతి:
మనము విద్యార్థులము; అధ్యయన యడిగి
కొసెడివాడొట మనకు హక్కులును లేవు;
మనకు విద్యాప్రదాత ఈ మాననీయు
డేది చెప్పిన నది చేయ నెంతో శుభము.
స్త్రీలకుప్రత్యేకముగా
నేలా యానంబులందు నేర్పాటులు నే
కాలంబునందు గల్గును—
చాలున్ నీవాదు నిర్వ్యాజాలదుసుమ్మీ!
అతడు వయస్సుమీరి మన
కన్నిట పెద్ద; గురుండుగాన సం
తతశుభకారి యాతని య
నంత మనీషకు దోయలించి ఈ
కొతుకులు మాని లెండు అవి
గోమధుమాసవీచంద్రికా
వితతుల చక్రవాకములు
వింతగ జూచు మనప్రలాపముల్
ధూర్తమతి:
విన్నారా! విన్నారా! ఈ
వీరునిమాటలు శేవులారా
కన్నారా! కన్నారా! ఈ
గర్వపుచేష్టలు కనులారా
ఇది విద్యార్థులకే యవమానం
లేదు లేశమైనా యనుమానం
సౌదామని:
అభిషంగం అభిషంగం ఇది మా
అభిమానంకే అవసాదం!
సౌదామని మమ్మాటికివిను నీ
జాడలపై నేనడచేది!
మహతి :
ఇది మహతీనివేదన యొ
కించుక శ్రద్ధగ నాలకించుడో
సదయమతుల్ ప్రమాదమగు
సంగతు లేర్పడి యాశ్రమంబులో
సదమలతన్ గ్రసించినవి
దయ్యాన నాతుదినాడు స్త్రీలకా
అదనపుటుత్సవంబులర
యక్ మన కెంతో విసర్జనీయముల్
నమ్రమతి:
మహతి! కన్యల యుత్సవమధ్యమందు
పాల్గొనగగోరు హక్కు మాపాల లేదు—
అవివిసర్జింపగా మీకు హక్కు లేదు—
యెట్టిహక్కులు గురునకె యేర్పడినవి
బాధ్యతలు లేని మనకు స్వత్వములు లేవు.
ధూర్తమతి:
ఇక భరియింపజాల వచి
యించుచునంటిని యుత్సవంబులన్
చకచక సాగనీబలెను
సాంతముగా మన శిష్యకోటి యిం
చుకయును తారతమ్యమను
స్పృక్కను లేక జరింపగావలెన్
ప్రకటితరీతిగుర్వలిది
వల్లెయనన్వలె రెండునాళ్లలో
రమ్మ సౌదామనీ మనలక్ష్యసిద్ధి
కిక తపశ్చర్యగావింప; నెంతవరకు
నీదుపితమది కరుగదో నీవు నేను
అంతకాల మాహార మంటబోము
సౌదామని:
సోదరవిద్యార్థులమంగళముకు
సోదరములమలమలదహియింతుము
మీ దయ రాగా అన్నల్లారా
ఆదరమేనుదురా మీరంతా
(అప్పుడెందరు ఎన్నివిధాలచెప్పినా వినక సౌదామిని ధూర్తమతులు నిరాహారదీక్ష వహించి భూతలశయనం చేసినారు. దీనికంతకీ కారణం ధూర్తమతికనుక కళాకోవిదుడు కన్నెఱ్ఱజేసి......)
కళాకోవిదుడు:
ధూర్తమతి నీకు నాంతరదృష్టిలేదు
నీతివల్లులు గమనింప నేర నీవు
బాహ్యదృక్కులు నిను పాడుపరచుగాన
అంధుడవుగమ్మ అడవుల నంటిబొమ్మ
ధూర్తమతి:
అహహాలోకముల్లెల్ల చీకటిగ దీ
వ్యత్తఢగమెవ్వారలో

(32-వ పేజీ చూడుడు)

**నవల:**




**శ్రీ నోరి నరసింహశాస్త్రి**

## ౨౦

దినము లట్లే గడచిపోవుచున్నవి. సోమయాజుల మహాభారత రచనమును అట్లే సాగిపోవుచుండెను. కరణపాఠశాలలో జేరిన బ్రాహ్మణులు ముందనుకున్నకంటె శీఘ్రముగా నా లెక్కల లోతుపాతులు గ్రహించుచుండిరి. వారికి రాత్రింబవళ్ళదే పని!

విజయదశమినాడు పట్టాభిషేకానంతరమున జరిగిన పేరోలగమున సమ్మెచేసిన జైనకరణముల నందరను క్షమించుచు శ్రీ రుద్రదేవమహారాజు చేసిన శాసనముతో ఆ కరణసంఘములో చీలిక లుదయించెను. అంతటితో నొక సంచలనము నేర్పడెను.

తాము చేసినది అపూర్వ మగు నపరాధము. ఒకానొక యావేశమే తమ్మందుకు ప్రేరేచినది. రాజధానీనగరమం దెల్లెడ నందర సామంతుల మంత్రుల దండనాథుల కార్యభరణుల వ్యవహారశాలలలో నిందరు నొక్కసారిగా పనికి పోకుండు టేమి? ఎవరైన తమ కవమాన మొనర్చిరా? భత్యములలో గాని వేతనములలో గాని తమ కేమైన లోటు చేసిరా? లేదే! అయినచో తమకు కోపకారణ మేమి?

యువరాజుగా హరిహరదేవు డైన నేమి, రుద్రమ్మ యైన నేమి, మనకు? ఇన్ని దినములును హరిహరదేవుడు గాని వీరభద్రేశ్వరుడు గాని మన కేమి యొరిగించిరి? రుద్రమ్మ మనకు చేసిన యపకార మేమి? గణపతిదేవులకు తన కూతుసవతిపిల్లలపైకంటె కూతుపై ప్రేమయుండుటలో తప్పేమి? మరియు దన కుమార్తె దౌహిత్రునిపైమాత్రము ఆయనకు ప్రేమ యుండుటలో అసాధారణ మేమి?

అబద్ధము లగు వేదములు మన్వాదిస్మృతులు ప్రమాణములుగా భ్రాంతిపడు వైదికులకు స్త్రీ రాజ్యము చేయుట కొంత వింత కావచ్చును. కాని మన జైనులలో స్త్రీలకు భర్తవలన వచ్చు నాస్తియందే సంపూర్ణ మగు అధికారము కలదే! అర్హతనీతి ఏమనుచున్నది?

'అనపత్యే మృతే పత్యౌ సర్వస్య స్వామినీ వధూః'

మరియు నదియే,

'విధవా హి విభక్తాచే ద్వ్యయం కుర్యా ద్యథేచ్ఛయా
ప్రతిషేద్ధా నకోప్యత్ర దాయాదశ్చ కథంచన'.

అని శాసించుచున్నదే! అదియును గాక శ్రీరుద్రమదేవులకు గణపతిదేవులవలన నీసామ్రాజ్యము సంక్రమించుచున్నది. అందుచే నది యామెకు సౌదాయిక మగు స్త్రీధనము. అది రేపు ఆమె తన యిష్టమువచ్చినవారికి దానము చేయవచ్చును. అర్హతనీతి యట్టి దానిగురించి ఇట్లు చెప్పుటలేదా?

'ఏతత్ స్త్రీధన మాదాతుం నశక్తః కోపి సర్వథా
భాగానర్హం యతః ప్రోక్తం సర్వై ర్నీతివిశారదైః'

అందుచే మన నీతిప్రకారముగా స్త్రీలకు తమకు వచ్చు నాస్తియం దెల్ల జీవితాంత మగు స్వత్వమే కాక సర్వస్వత్వము గలదు. మన కేల కష్టము, వారు మనధర్మమే యవలంబించినపుడు! ఉన్నచో వేదవాదుల కట్టి భ్రాంతు లుండవచ్చునుగాక!

పూజ్యు లగు వీరభల్లటదేశికులకు రాజసభలో నేదో అవమానము జరిగిన దని ఘోషించినారు. కాని నిజముగా వారి కేమి యవమానము జరిగినది? వారికి తోచిన ధర్మము వారు ప్రవచనము చేసినారు. వారిది స్వభావసిద్ధముగా తొందరవాక్కు! కొంచెము కటువుగా పలికినారు. రాజసభలో మంత్రిసామంతాదు లాకాఠిన్యము సైరింతురా? వారుమాత్రము శ్రీవీరభల్లటదేశికుల నేమన్నారు? వారి వాక్పారుష్యమును కొంత విమర్శించినారు.

అయినను యువరాజు కావలసినది మా కొమారుడన్న మా కుమారుడే యని వి దించుచున్నది మహాదేవరాజును, వీరభద్రేశ్వరులును. అందులో వీరభద్రేశ్వరుడే విశ్వేశ్వరశంభువును ధర్మము నిర్ధారణచేయు మని యర్థించెను. ఆయనకు దోచినది ఇరువురకు గాకుండ మధ్యమార్గము సూచించినాడు. అది చక్రవర్తికి సమ్మతమైనది. మంత్రిసామంతదండనాథులు పలువురకును అది నచ్చినది. మధ్య మన కేందుకు? ఆ వీరభల్లటదేశికులే మరల పట్టాభిషేకసమయమున ఆ రుద్రమదేవుల నొక కలశము చేతగొని యభిషేకించెనే!

మనము చేసిన యపరాధములకు శిక్షలు విధించుటలో ప్రభువుల తప్పేమియు లేదు. శ్రీరుద్రదేవమహారాజులు మనల నందర బంధవిముక్తుల గావించి పలువుర కంఠములే కాపాడినారు! అధికారులకు క్షమాపణము చెప్పికొని యథాప్రకారము మన వృత్తులు స్వీకరించుట యుత్తమపద్ధతి!

జైనకరణములలో పలువురు పైవిధముగా తలంచి యనేకవిధముల నధికారుల క్షమాభిక్ష వేడికొని పూర్వపదవులలో జేరిరి. కాని అందులో నత్యున్నతపదములందున్నవారికి పలువుర కొక చిక్కు వచ్చెను. వ్యవహారశాలకు తాము రాకున్న దినములలో ప్రధానపదవులు నెల్లూరినుండి వచ్చిన యా పాకనాటి బ్రాహ్మణ

కరణములకు అప్పటికే స్థిరపడిపోయెను. వారిని తొలగించి మరల వీరికి ప్రాతయున్నతోద్యోగము లిచ్చుటకు అధికారు లనుమతింప లేదు. అందుచే తాము పూర్వము ఉన్నతాధికారము నెరపినచోటనే ఇప్పుడు ద్వితీయస్థాన మాక్రమింపవలసివచ్చినది. అది యట్టివారికి చిన్నతన మనిపించెను. వారితల కొట్టివేసినట్లే వారి కది భాసించెను. కొందరు స్వయంకృతాపరాధ మని యందుకు తల లొగ్గిరి. కాని పలువు రందు కియ్యకొనక పనులు చాలించికొనిరి.

అన్నమంత్రీశ్వరుని ప్రధానకరణ మగు నాగాచారికి కరణసంఘమున విశేషగౌరవమును పలుకుబడియు గలదు. కరణములు సమ్మెచేయవలె నను నపూర్వవిషయ మూహించి దికేము నతడే. అతడు తన తలదక్కదని తెలిసి విజయదశమి వెళ్లువరకును బయటపడ లేదు. ఆ మరునా డతడు జంకుచు అన్నమంత్రిదివాణమునకు బోయెను. అతని కక్కడ స్థానము కనబడలేదు. అంతట నాతడు అన్నమంత్రిని దర్శించెను.

అతనిని గాంచినంతనే అన్నమంత్రి జీతబత్తెములు లెక్కలు వేయు కరణమును బిలిపించి వెంటనే నాగాచారికి రావలసియున్న వేతనమంతయు లెక్కకట్టించి యాతనిముందు పెట్టించెను. నాగాచారికి మాట్లాడుట కవకాశము కలుగలేదు. అన్నమంత్రి కింకను ఏదో మనవిచేయవలె నని యున్నట్లాత డించుక యనుమానించుచు అక్కడనే నిలువబడెను.

“లెక్కలో తప్పేమైన నున్నదా?—ఏదీ?” అని యా లెక్కవేసిన కరణమునొద్ద గల పత్రములు అన్నమంత్రి తీసికొని పరీక్షింపసాగెను.

అది చూచిన నాగాచారికి కోపము ఆగలేదు. ఉద్రేక మే కలిగెను.

“మంత్రీశ్వరా, మీరు పెద్దలు. ఇన్నాళ్ళు మీకును మాకును గల ఋణబంధము ఒక్కసారిగా కోసివేయుట శ్రేయస్కర మనియే ఎంతురా?” అని యాత డనివేసెను. అతని సర్వాంగము వడకుచుండెను.

అన్నమంత్రీశ్వరుడు ప్రత్యుత్తర మీయలేదు. చిరునవ్వు మాత్రము నవ్వెను.

ప్రత్యుత్తరమునకై నాగాచారి కొంతతడవు నిరీక్షించెను. అన్నమంత్రి యా గణితము పూర్తిచేసి యావల నుంచి మఱుమాటాడక మొదలు తాను చేయుచుండిన పనిలో నిమగ్ను డయ్యెను. కొంతసే పక్కడనే నాగాచారి యట్లే నిరీక్షించెను. ఇంకను అట్లే యున్నచో బవిరినీడు వచ్చి తన్ను బయటికి బలవంతముగా తీసికొని పోవును. అది తెలిసిన నాగాచారి ‘సెలవు తీసికొందును!’ అని నిర్లక్ష్యముగా పలుకుచు తన కిచ్చిన ద్రవ్య మచ్చటనే వదలి వెడలి పోయెను.

సర్వమును అన్నమంత్రి పరీక్షించుచునే యుండెను. నాగాచారి వెళ్లినదేతడవుగా అతడు తన యాశ్వికభటు డగు బవిరినీని బిలిపించి యా ద్రవ్యము నిర్దేశించి యది నాగాచారియింటియొద్ద నిచ్చి రమ్మని పంపెను. అతడా ద్రవ్యము నాగాచారిఇంటికి చేరకముందే అక్కడ చేర్చి వచ్చి మంత్రీశ్వరునకు నివేదించెను.

నాగాచారివలెనే కొంచె మించుమించుగా ఎందరో ప్రధానకరణములును పెద్దకరణములును తమ యుద్యోగములు పోగొట్టుకొనిరి. వారితోపాటు వారి నాశ్రయించుకున్న చిల్లరవ్రాయసకాండ్రును పలువురు మరల తమ పూర్వపు బనులలో జేరుట కిచ్చగింపలేదు.

తాటాకులపై గంటము చెక్కుకొనిపోయిననే గదా లేఖనము సిద్ధించునది! రాగిరేకులపై లేఖనముకూడ శాణము చిరుసుత్తియ సహాయముతో కొంచెము హెచ్చుతగ్గుగా నట్లు ప్రసరించుటవలననే గదా సాధ్యపడునది! తాటాకులపైనను రేకులపైనను అక్షరములు లిఖింపబడును. మరి శిలలపై నక్షరము లగు రూపములే తొలువబడును. సుత్తిదెబ్బలతో టంకము శిలలపై రూపకల్పన చేసి శిలలను గండారపు బొమ్మలనుగా మార్చివేయును. ఆ పనియే కొంచెము భేదముతో చేసిన దారువులును ఉలిచే బాడిశల సహాయమున అనేక రూపాంతరము పొంది సజీవము లగును. స్వర్ణాదిలోహములను కరగించి ఆభరణ విగ్రహాదిస్వరూపములను పొందించుటకూడ పై కార్యములకు తుల్యమైనదే. ఈ విద్య లన్నిటికి సారూప్య మున్నది. కాని యీ యన్ని విద్యలలో ఒక్కొక్కదానిలో ప్రత్యేకప్రావీణ్యము అభ్యాసముచే సంపాదింపవలెను. అంతే! వ్రాయసకాండ్రు వ్రాయసవృత్తితోపాటు దారుశిలాస్వర్ణాదులలో నొకటిగాని కొన్నిగాని యన్నియు గాని యభ్యసించుట యలవాటు. ఆ యన్నిటిలో వ్రాయసవృత్తి సులభముగా కనుపడును. కాని కళాకుశలు రగు నా జైనకరణముల హస్తములలో లిఖించు తాళపత్రములు గూడ నొక యపూర్వశోభతో విరాజిల్లుచుండెను.

మరియు నొక విశేషము కలదు. అప్పటికే చాలకాలము నుండి దక్షిణదేశమున భూర్జపత్రముల మీద వ్రాయుటకూడ వాడుకలోనికి వచ్చినది. దాని యందు జైనకరణములకు విశేషయభిమానము. భూర్జపత్రముపై గంటము సాగదు. దానిపై తూలికలతోడనే వ్రాయవలెను. వ్రాయుటకు ముందు వారు ఆపత్రమును రంగురంగుల తీవలతో బొమ్మలతో నలంకరించి వానిపై బంగారు వెండి హరిద్రా కుంకుమములు ఇత్యాదు లద్ది వ్రాతకు ఆయత్తము చేయుదురు. అట్లు పత్రము శోభాయమానముగా దిద్ది గాని యందుపై వారు వ్రాయ దొరకొనరు. వ్రాత యనునది పత్రములపై చదువుటకుమాత్ర ముపయోగించు సంకేతము లగు కొన్నిరూపములను ఉంచుట కాదు అవి సంకేతములే కాదు. అవి అక్షరములు! దేవసదనములో పూజామూర్తులెట్లో పత్రముపై వ్రాసిన యక్షరము లట్లు! దేవసదనము లలంకరించినట్లే పత్రములను చూచువారికి ఆకర్షకముగా నుండవలెను. జైనమతమున నీ సృష్టియు నిత్యమే. దానికి నాశము లేదు. సిద్ధిపొందదగిన జినునకు ఈ శరీరమే అందుకు సాధనము. అందుచే ఈ శరీరమును పరిశుభ్రముగా పవిత్రముగా ఉజ్జ్వలముగా నుంచవలెను. అందుచే వారు వ్రాయు పత్రములు అందలి యక్షరములు రమణీయోజ్జ్వలములుగా నుండవలెను. మరి యా పత్రములు గ్రథనము చేయు కోశములుగూడ చూచువారికి పూజ్యభావము సద్యస్స్ఫూర్తిగా కలిగింపవలెను. వ్రాయుటకూడ ఒక శిల్పమే, ఒక కళయే! ఆ విషయము జైనుల గ్రంథములు చూచినవారికి అవగత మగును.

ప్రధానకరణములు పలువురు మిక్కిలి ధనవంతులు. వారికి జీవనములకు వ్రాయసవృత్తిపై నాధారపడవలసిన యవసరము లేదు. వా రనేకశిల్పములందె కాక స్థాపత్యమునందుగూడ సమగ్రులు. అందులో ఎవరి కభిమాన మున్న కార్యములు వారు చేయగలరు. ఆంధ్రరాజ్యమున గాకున్న వారు దేవగిరికి పోగలరు. కళింగమున వారికి బహుమానములు లభించును. హొయిసలబల్లాల రాజ్యమునను చోళపాండ్యకేరళాదిదేశములలోనను వారిని నెత్తిన పెట్టుకొందురు. అందుచే కొందరు నిర్లక్ష్యముగా నంధ్రదేశము వదలి నలుదిశలకు

(29 వ పేజీచూడుడు)

విజ్ఞానం, వినోదం:

# మన ముక్కుగతి ఏమౌతుంది?



మన ముక్కుల్ని గురించి చాలా హీనంగా, కొంత అవమానకరంగా మాట్లాడారట డా॥ రిచర్డ్ వాన్ మైజెన్. హార్వర్డ్‌లో సైన్సు అభివృద్ధికోసం ఏర్పాటు చేసిన సభలో ఆయన మాట్లాడినది. అలా మాట్లాడినట్లు పత్రికల్లో పడింది. కాబట్టి అందులో అసత్యం ఉందని అంతగా సంకోచించవలసిన అవసరం లేదు. ఆ వార్త సత్యమే ననుకుందాం కాస్సేపు.

ఆయన మాట్లాడుతూ ముఖ్యంగా మనుషుల ముక్కుల్ని గురించి అవహేళన చేశాడట. అంటే మన ఘ్రాణశక్తిని గురించి, ఈయన మాట్లాడినదానికి జంతుశరీరశాస్త్రవేత్తలు తప్పకుండా హర్షిస్తారు.

ఘ్రాణశక్తి, అంటే వాసన చూసే సత్తాలో మనుష్యులు కుక్కలముందు తీసికట్టే. వేటకుక్క ఉందంటే, దాని ముక్కుకి మనిషికో రకం వాసన చొప్పున తగుల్తుంది. వేటకుక్కే అక్కర్లేదు. తక్కువజాతికుక్కల్ని తీసుకున్నా, డజను అడుగుజాడల్లో ఒక మనిషిజాడని సులువుగా వెంటాడగలవు. నిజానికి కుక్కల ముక్కులికి నేలంతా రకరకాలవాసనల్తో గజిబిజిగా ఉండి ఉండాలి; పట్నంలో రహదారి పక్క ఇంట్లో రకరకాలమోతలూ ఈలలూ కేకలతో రణగుణధ్వని ఉన్నట్లు. ఆ వాసనల్లో కొన్ని మంచివీ, కొన్ని దుర్భరమైనవీ కూడా ఉండిఉండాలి. కుక్కలు నేలమీద ముక్కు ఆనించి పసికట్టుతోంటే ముఖం మీద ముడతలు చూస్తే ఈ విషయం బోధపడుతుంది. పందులికూడా కొద్దో గొప్పో వాసనలు తెలుసు. కాని పందులు చూసే వాసనల్ని గురించి అట్టే యోచించలేం. అయితే పందులే లేకపోతే ఫ్రాన్సులో రైతులు కొన్ని దుంపల్ని తవ్వనేలేరు. ఈ దుంప లెక్కడున్నాయో తెలుసుకోడానికి పైకి ఆకుతీగలైనా ఉండవు. పొలాల్లోకి పందుల్ని వొదుల్తారు రైతులు. అవి వాసన చూసి ముట్టెతో నేల తవ్వడానికి పూనుకునేచోట దుంపలున్నాయన్నమాటే. మరి రైతులు వాసన చూసి కనుక్కోలేరు.



ఆమాటకొస్తే మనముక్కులు అంత అవహేళన చెయ్యతగినవి కావు. మనకళ్ళకుండే తీక్ష్ణశక్తి మన ముక్కులికి వాసనచూడ్డంలో లేకపోవచ్చును. అయినా మనుషుల ముక్కుకి వెన్నువిరుచుకుని చెప్పుకోతగ్గ గొప్పలున్నాయి. ఆ ఘ్రాణశక్తిలో మనకంటె ఊరకుక్కలు కూడా గొప్పయితే కావచ్చు. కాని వాటిని గాలిలో ఫినాల్ వాసన పట్టమనండి చూద్దాం. లాభం లేదు. అందులో మన ముక్కుదే పైచెయ్యి.

వాసనచూడ్డానికి ముక్కుని కాదని ఏయంత్రం పనికొస్తుంది? ఇంతవరకూ అటువంటిది పుట్టలేదు. ముందుమాట అప్పుడే చూడవచ్చు. ఆస్మోస్కోప్‌లు, ఒల్ఫాక్టో

(32-వ పేజీ చూడుడు)

కథానిక:



శ్రీ బలివాడ
కాంతరావు



# పరితప్త సువర్ణం

"దీని మొగుడు విడిచిపోయాడు. ఆ అన్నా వదినా మంచివాళ్లవబట్టి యేదో కడుపుకి జరిగిపోతోందత్తయ్యా" అని సుందరమ్మని చూపించి మాణిక్యం చెప్పేసరికి 'అయ్యోపాపం!' అంది ఆ గొప్పింటావిడ.

సుందరమ్మ యిలాంటి మాటలు వినటం తొలిసారి కాదు. యెందరో ‹ంలానే "పాపం" అన్నారు. అంతే కాని యీవిడ మాత్రం "అయ్యోపాపం" అని పూరుకోకండా ఆమెనిగురించి పూర్తిగా తెలుసుకోడానికి వుబలాటపడింది.

గదిలో సావధానంగా కూర్చుని తమలపాకుల పెట్టె ముందు పెట్టుకొని తీరిగ్గా చెప్పడానికి వుపక్రమించింది మాణిక్యం- 'ఏదీ... నేను కాపరానికి వచ్చి యిరవై యేళ్లు కామోసు అయ్యింది. అప్పుడు యిది కడుపులో వుండేది. వీళ్ళమ్మ చచ్చి ఏ స్వర్గాన వుందోగానీ ప్రాణం పెట్టేదత్తయ్యా. మా అబ్బాయి కరిణీకం కాదుగానీ లేని పని కల్పించుకు నేవారు. పొరుగున వీళ్లు లేకపోతే పిల్లాపిచ్చుక లేకపోయినందుకు ఒంటిగా చచ్చేదాన్ని..."

వంటయింటి తలుపుచాటునుంచి వింటున్న సుందరమ్మ పొయ్యిలో కర్రల్ని యెగదోసి మళ్లీ తలుపుచాటుకి వచ్చింది. సుందరమ్మ కథ బదులు మాణిక్యం కథే అడ్డూ ఆపూ లేకుండా యింకా సాగిపోతోంది. కాస్సేపటికి ధోరణి మారటంతో సుందరమ్మ నిట్టూర్చింది.

"అన్నా చెల్లెలికీ ఒక్కసారే పెళ్లయింది. ఆ అల్లుడు చూస్తే యేనుగంతమనిషి – దీనికి యెనిమిదేళ్ళే... బొద్దుగా నల్లగా వుండేది. ఆ కాలంలో యీడాజోడా-నీకు తెలిదూ! పదేళ్లు కాకండా పెళ్ళి కావాలిగానీ... నరసింహం కిజోడీ బాగాకుదిరింది... కాని వాడి చరిత్రం యేమిటో అత్తయ్యా—యేటేటా హెచ్చిపోతోందిగానీ తీరేదారి కనిపించడం లేదు. యిద్దరుపిల్లలు - వాళ్లకి కడుపు నింపుగా తిండిపెట్టలేక యేడుస్తాడు. మనం యేదో కనికరించి నాలుగుగింజలిస్తే యెన్ని పూటలు తింటారు? ఆ చదువా... గోచీకి పాడవ్వా గావంచాకి కురచా అయిపోయింది. ఉన్నూర్లో కూలిపని నామోషీ కాదూ? యేదో వ్యవసాయం పనా అంటే అదీ చేతకాదు-మనిషేం బలంగా వున్నాడని! గోరుచుట్టుమీద రోకటిపోటులా యిదొకటి! ఆ వెధవ దీనికి బుద్ధొచ్చేవరకైనా వున్నాడు కాదు. అల్లుడని మహా సర్దాపడి వున్న కాస్త బంగారం పిసర అమ్మి బాగా తినిపించేది – స్వర్గంలో యెక్కడుందో కాంతమ్మత్త. ఇదంతా దానికి కావాలా అత్తయ్యా. కష్టపడేవాళ్లు వీళ్లేగా. సంసారం యిలావుంటేయీ సుందరమ్మకి శాంతం వుండొద్దా, అంటాను. పదేళ్ళయింది ఆ వెధవ కాపదాన్ని పట్టుకొని యేకలకత్తా వెళ్లిపోయాడో? వాడు మళ్ళీ వచ్చి దీన్ని యేలుకుంటాడని ఆశగానుందా? యేమీ లేదు. సంసారం అన్నాక యేదో మంచో చెడ్డో యెవరివల్లో ఒకరివల్ల తప్పో ఒప్పో వుంటుందా? అందులో ఒకపూట కుంటే ఒకపూట కు లేని సంసారమాయె – సర్దుకుపోవాలిగానీ. నరిసింహం పెళ్లాం కాస్త నోరున్న మనిషి—చికాగ్గా వున్నప్పుడు యేదో అంటుంది. నా ఖర్మం యిలా కాలిందని యేదో సర్దుకుపోవాలి గానీ...

కాం టే జవాబు లెందుకివ్వాలని... నాలుగు తింటుంది... మరి నా మనసు వుండబట్టదు. ఒంట్లో నీరసంగా వుందని... యిలా యెవరైనా వచ్చినప్పుడు కాస్త వండి పెట్టమ్మా అని తెస్తుంటాను. 'ఒక పూటైనా కడుపు నిండా తింటుందని......"

ఉపదేశధోరణిలో వెళ్లిపోతున్న స్వీయగాధని సుందరమ్మ ఆలకిస్తున్నా, యిదంతా నిజానికి చాలాదూరం అనుకుంది. తనెప్పుడూ వదినెకు కాంటే జవాబు లివ్వలేదే. అందరిలా మాణిక్యంకూడా వదిననే సమర్థిస్తోంది. ఆమె తనకి కట్టుకోమని యిచ్చిన పాతచీరను వదిన బలవంతంగా లాక్కోవడం ఆమెకు తెలుసే! అన్నయ్యని అడిగి పొరుగూరి వుత్సవానికి వీధిలో వారితో వెళ్ళిందని నోటికివచ్చినట్లు మాణిక్యం యెదర 'నే కూసింది! 'అయ్యో భగవంతుడా నాపిల్లల కడుపు మాడ్చేస్తున్నావ్. అవును - జేష్టాదేవి మాయింట్లోవుంటే సిరిక్కడవచ్చిపట్టుంది? యిలా పరోక్షంగానైనా తనకి వినిపించేటట్లు వదిన అన్నదే! అప్పుడు మాణిక్యం యెదురుగానే అమ్మను తలచుకుని కడుపు సముద్రమయ్యేటట్లు యేడ్చింది. గంజినీళ్లైనా గిన్నె నిండుగా పోసుకోనివ్వదు - యిలాగ ఒక్కనాడైనా అమ్మ చేసిందా? మాణిక్యంకు యివన్నీ తెలుసే-తన కష్టాలు యేం చెప్పుకున్నా ఆమెతో తప్పించి యింకెవరితో చెప్పింది? సమయానికి తగ్గమాటలు ఆడి తనని ఓదార్చేది - చివరకి 'నగురించి యింకొకరితో చెప్పేటప్పుడు నిజాన్ని యింతగా మభ్యపరుస్తుందేం?

వదిన అన్నయ్య యేడిస్తే ఓదారుస్తుంది. తను అమ్మను తలచుకొని యేడిస్తే 'యెందుకమ్మ నిండుప్రాణాలున్న యింట్లో యీ రోదనం' అంటుందేం? బ్రతికున్న చివరి రోజుల్లో నిద్రాహారాలు లేక 'నేను కళ్లు మూస్తే నాకూతురుగతేం కాను'అని అమ్మ పలవరించి యేడుస్తోంటే వూరుకో అమ్మా' అని ఓదార్చేది. యిప్పటి తన పరిస్థితిని, అమ్మ యేడుపునూ మనసులో వుంచుకొని ఆలోచిస్తుంటే తల మొత్తుకోనేటంత దుఃఖం వుబికింది. యీసంఘంలో ఆడదానికి, అందం శక్తి, దక్షత-వీటిలో యే ఒకటి లేకపోయినా, బ్రతకటం దుర్లభం. సుందరమ్మకు వీటిలో యేదీ లేదు.

అస్పష్టమైన ఆలోచనలతో తలంతా తిరిగిపోయింది. వంటగది పొగతో నిండిపోయింది. చుట్టపుచూపుకు వచ్చిన ఆగొప్పింటావిడ అన్నమాటలు చెవిలోకి దూసుకుపోగానే సుందరమ్మ గతుక్కుమంది. జబాబుగా మాణిక్యం "తప్పకుండా' వస్తుంది. మీయింట్లో తిరిగే భాగ్యం పట్టాలా? మరేం పూచీ లేదత్తయ్యా! వంట చెయ్యటంలో మహాఘటికురాలు. మాంచిరుచైనకు చెయ్యి కడుపుకు తిండీ, ఒంటికి బట్ట దొరికితే యింకేం గావాలి...యేం చాతకాని అన్నదమ్ముడు. యేదో ఎప్పుడో మీరు కనికరించి నాలుగురాళ్లు పంపిస్తే రెండు పూటలు తింటాడు"...

మాణిక్యమ్మ యిచ్చిన యీ సమాధానం నవ్వుల్లో గుయ్ మనటంతో సుందరమ్మ వుక్కిరిబిక్కిరై పోయింది. గడబిడగా పొయ్యిదగ్గర కూర్చొని ఆత్రుతకొద్దీ గొట్టం పట్టుకోకుండా వూదింది. కళ్లల్లోనూ, ముఖంమీద బూడిదరేణువులు అంటుకున్నాయ్ - కళ్లు నలుపుకుంది. మాసినచీర కొంగుతో ముఖాన్ని కప్పుకొని...తల పగిలిపోతున్నట్లు, నరాలన్నీ తెగిపోయినట్లు బాధ పడింది.

మాణిక్యం వుత్సాహంతో నవ్వుకుంటూ వచ్చి "నీ కష్టాలు గట్టెక్కాయ్‌లేవే. పట్నంలో కడుపునిండా తిను. రామా కృష్ణా అని పడుండు. వెంకమ్మత్తయ్యతో రేపే నీ ప్రయాణం."

మబ్బుల్లోనించి ఆకాశవాణి గర్జించినట్లుగా పొగమధ్యనుంచి "నేను వెళ్లను" అంది సుందరమ్మ.

"యేమిటే! వెళ్లవూ? యేమే నీకు మతిగాని పోయిందా? నరసింహం - మీవదినా ఒప్పుకుంటే."

యీ మాటలతో ఆమెఒళ్లంతా బరువైపోయింది. అలా కూలబడి కూర్చుంది. గర్జించిన గొంతుక శోకంతో నిండిపోయింది. యేమీ ఆలోచన తోచక హృదయంలో పెద్దపెట్టున యేడ్చుకోవటం మొదలుపెట్టింది. ఎందుకో పెదిమలు కంపించాయ్ - నల్లని ముఖం పాలిపోయింది. దుఃఖం జలపాతంలా పడి కడుపును దొలిచివేసింది - అమ్మను తల్చుకొని దుఃఖాన్ని ద్విగుణీకృతం చేసింది.

మాణిక్యం ఒకేదృష్టిలో చూస్తోంది కాబట్టే యిదేమీ అర్థం కాలేదు. పైగా సుందరమ్మ ఒక పిచ్చిదానిలా కనిపించింది. తలవనితలంపుగా అరచేతిలోనికి వచ్చే సుఖాన్ని విడిచిపెట్టుకోవటం శుద్ధ తెలివితక్కువ కాదా? అయినా ఆమెమాటకు తిరుగుండదనే ధైర్యం లేకపోలేదు. అంచేతనే నిర్లక్ష్యంగా వెళ్లిపోయింది.

సుందరమ్మకు ఒక క్రొత్త నరకం కనిపించింది. అందులో ఆమె పడవలసిన బాధలు కళ్లకు కట్టాయ్. భాగ్యవంతుల యిళ్లల్లో యెప్పుడూ వాళ్లగురించి వినంది యెలా పనిచెయ్యటం? పోనీ వెంకమ్మ ఆ యింట్లో వుంటే యెలానో ఓలా ఆమె అండను నిలచి పనిచేసేది. ఆమె తీర్థయాత్రలకు వెళ్లిపోయి కొన్ని నెలలవరకు రాదట! అలాంటప్పుడు అసహ్యమైన బట్టలతో నల్లటి ముఖాన్ని వాళ్లకి చూపించటమెలా? అమ్మను తెలిసినకదినే యిలా అంటుందే - అమ్మను తలచుకొని యేడిస్తే అమ్మముఖం చూడనివాళ్లు యింకెంతగా తనని ఒళ్లు చచ్చిపోయిన మాటలంటారోనే యింతో అంతో వున్న మాణిక్యానికే అంత టెక్కు కదా, మేడమిద్దెల్లో గంపెడు బంగారంతో వున్నవాళ్లకింకెన్నిరెట్లు గర్వమో?

ఇలా ఆలోచిస్తూనే కళ్లల్లో నీరు నిండుకుంటోంది. పెరటితలుపు తెరచివుందేమో ఆ కళ్లతోనే చూసింది. పచ్చని పంటపొలాలు, తను రోజూ తెల్లవారేసరికి బుడక పెట్టినది, రోజూ నీరు పోస్తున్న బంతి మొక్కలు, కుడితికుండ మోసుకెళ్లేటప్పుడు ఆత్రుతగా 'అంబా'అని పలుకరించే అవు - కనిపించాయ్. జామిచెట్టుకు కట్టిపెట్టినమూడ గిజగిజ గింజుకుంటోంది. అవు ఆత్రుతపడుతోంది. సుందరమ్మఒళ్లంతా జరజర లాడింది. తల్లి గతించినదగ్గరనుంచి అసహాయత ఒక అలుపుపెట్టినట్లే ఆమెజీవితం మీద పనిచేస్తోంది. యిలా వుద్రేకం కలిగేటప్పుడు అమ్మకాళ్లు గట్టిగా పట్టుకొనేది. కానీ యిప్పుడు ఆకళ్లకి కాగకుండ,నిప్పుతో మండేపొయ్యి అగపడింది. ఒళ్లంతా చెమట పట్టింది-అమ్మే బ్రతికుంటే యింకొకరింటికి తనని పంపించేదా? ఆ గంజోకడుగో వున్న యింట్లోనే త్రాగే పడుండ నిచ్చేది.

ఆ మరుక్షణంలో వదిన మస్తిష్కంలో విహరించింది. తల బాగా బరువెక్కింది. మాణిక్యంఅన్నమాటలు గింగురుమంటోంటే ఆ చీరకొంగును అలా పొయిలో తనచేతితో క్రలుపెట్టేటట్లే పెట్టాలనుకుంది. చెయ్యి వణికింది-అందంగా కనిపించింది. నాదీ అనే అభిమానం గుండెను హత్తుకుంది. ఒళ్లు నిండుగా వున్న యౌవ్వనాన్ని ఒకసారి చూసుకుంది. ప్రయోజనంగూర్చి ఆలో

చించకపోయినా మెదడుమారుమూలల్లో ఒక తియ్యని తలపు దాచిపెట్టుకుంది.

* * *

సుందరమ్మకు భవిష్యత్తంతా నిరాశగానే కనిపించింది. యీ పల్లెలో జ్ఞానం వచ్చాక సుఖపడ్డానని తృప్తిపొందలేదు. కష్టపడ్డది. ఆ వూళ్లో వీచేగాలి, కాచేయెండా, పెరిగిన పైరూ, విరిగిన ఆశలూ ఆమెను పెంచుకొచ్చాయ్. ఆవూళ్లో గడియకున్న యేడుపు తప్పించి, ఆమెవుపయోగించుకొన్నవీ, సేవించేవి, అన్నీ దూర మైపోతాయ్.

వెళ్లిపోయేముందొక యెముకలపోగు కనిపించింది. ఆశ అనేది సూక్ష్మదర్శినిలోనైనా కనిపించినట్లుంది...కడుపు అంటుకుపోయింది. తన శరీరమనే అభిమానం యేమాత్రం లేదు. అమ్మ వున్నప్పుడు అన్నయ్యనీ-యీ అన్నయ్యనీ-యెదురుగా పెట్టుకొని చూస్తుంటే గాబరా...జాలీ యేడుపూ రక్తంలో కరిగిపోయాయ్. బాధ భరించలేక తలుపుచాటున ముఖం దాచుకొని బావురుమని యేడ్చింది.

అన్నయ్య కొంతదూరం సాగనంపడానికి వచ్చాడు. ముఖంలో నెత్తురుచుక్క లేదు. ఒక్కమాట చెప్పలేకపోయాడు. తన చేతిలో పెట్టి 'జాగర్త నాయనా!' అని కళ్లనీరుపెట్టిన తల్లికే ద్రోహంచేస్తున్నానని కుమిలిపోతున్నాడు. అడుగుతీసి అడుగువేస్తోంటే ఒళ్లు ఝుల్ ఝుల్ మంటోంది...అయితే ఒక మంత్రంలా దాని వెనకాలే తన దరిద్రం, తన పిల్లల యేడుపూ తనమీద పనిచేస్తున్నాయ్.

తలవంచుకొని వెనుకనేవచ్చే అన్నయ్యను చూసింది. తన భారం కొంచెం తగ్గి, తనేమైనా సహాయపడేస్థితివస్తే యేమైనా కోలుకుంటాడనే ఆశ మొలకెత్తటంచేత, దుఃఖాన్ని దిగమ్రింగుతో నడుస్తోంది. పాలిపోయిన ముఖంతో పలకకుండా వచ్చే అన్నయ్యతో అనలేక అనలేక "నువ్వుండు అన్నయ్య! వదిననీ యేమీ అనకు. ఆ తల్లికి యెప్పటికైనా కనికరం పుట్టదా?" అంది.

రోజూ తెల్లారేక యేటిలో ఒక బుడక పెట్టి పార్వతీశిలలకు పసుపురాసి మ్రొక్కేది. ఆ తల్లి మరెవరో కాదు. పార్వతీదేవి. ఆ శిలలను విడిచిపెట్టినా ఆ భక్తినీ, నమ్మకనూ తనతోనే తీసుకుపోతోంది. నీరు పల్ల మెరిగినట్లే యిలాంటి అమాయకపు జీవులు సత్యపథాన నడుస్తారు.

చురచురశబ్దం వినిపించింది. ప్రక్క పొలంగట్టువారగా బురదను చీల్చుకుంటూ యేదో జీవి ప్రాకిపోతోంది!

"వస్తానమ్మా" అని వెళ్లిపోయాడు నరసింహం. బురదతోవున్న పొలంగట్లమీదుగా నడుస్తూనే వెనుకకు తిరిగిచూసేది-అన్నయ్య దూరంఅవుతున్నకొద్దీ ఆమెగుండె బరువెక్కేది...గట్లుదాటి రోడ్డు చేరేటప్పటికి తను యెన్నడూ చూడని చెట్లూ చేమలూ మనుషులూ తారసిల్లారు. వెంకమ్మ తన మనుమడు, మనుమరాల గొడవ, వాళ్ళ రుచులూ, పచులూ, అలవాట్లూ, అభిప్రాయాలూ తోచినట్లు చెప్తూనేవుంది. రైలుస్టేషను చాలా దగ్గరనిపించింది.

* * *

పట్నంలో ఆ మేడలో వున్న సామానులనీ, వాకిట వున్న కుక్కనీ; దొడ్లో వున్న రంగురంగుల మొక్కలనీ చూసే కాక ఎలక్ట్రిక్ దీపంవల్ల యేర్పడిన తన నీడనే చూసి భయపడింది. ఆ యింట్లో వెంకమ్మ తప్పించి మిగతావాళ్ల యెదురుగా నిలపడ్డానికి ఒళ్లు చచ్చిపోయేది. ఆ రాత్రంతా సుందరమ్మకు సరియైన నిద్ర లేదు. అన్నయ్య, వదిన, మాణిక్యం, యేరు, పొలాలు, పొయ్యి, ఆవూ, దూడ, బంతిమొక్కలూ ఆ వూరంతా తలలోనే పెట్టుకుంది. యీ సిమెంటు గచ్చు చల్లగా, యీ అన్నం మోటుగా అంతా అదోకలా వుంది. రాత్రి జరుగుతున్నకొద్దీ తిరిగి వెళ్లిపోవాలనే కోరిక ప్రబల సాగింది. తెల్లవారఝామున మగతనిద్ర కమ్మేసింది. యేవేవో కలలు గంది. తెలివి వచ్చేసరికి భళ్ళున తెల్లవారింది. నాలిక కరుచుకొని గబగబ లేచిపోయింది. అప్పటికి యింట్లో యెవరూ లేవలేదు. ఎటు వెళ్లాలో యేం చెయ్యాలో తోచలేదు. తెల్లని గోడలూ, మంచాలు, కుర్చీలు, బెంచీలు బీరువాలూ, బొమ్మలు అగపడ్డాయ్. మరుక్షణంలో యెదురుగా యేరు - వాళ్ళయిల్లు ...పార్వతీశిలలు, బంతిమొక్కలు...రాను రాను లీలగా తను నడుస్తుండగా మందంగా వీచేగాలికి చురచురలాడుకుంటూ తలలు వంచుకొనే వరిపైరూ...ఒక్క యెగురు యెగిరి కూలబడిపోయే మిడతలూ...జురజుర శబ్దంతో బురదనీ, పైరునీ చీల్చుకొనిపోయే పాము—అమ్మో.. అడిగో యేడవ గలిగినా యేడవలేని అన్నయ్య వెనక్కి వెళ్లిపోతున్నాడు...తలబరువు మొయ్యలేక మళ్లీ చాప మీద బోర్లపడింది. మనస్సంతా దుఃఖంతో నిండిపోయింది. అమ్మాఅని వక్షాన్ని హత్తుకొని జోడించిన చేతులతో తల్లినీ, పార్వతీదేవినీ ప్రార్థించుకుంది.

"లే అమ్మ సుందరీ" అంది వెంకమ్మ. యీపిలుపుతో ఒళ్ళంతా గిలిగింతలతో నిండిపోయింది. లేస్తూనే దుఃఖాన్ని దాచిపెట్టింది. దుఃఖానికి లొంగిపోవటం, మళ్లీ దానినుంచి హఠాత్తుగా విడుపించుకోవటం అలవాటైపోయిందామెకు.

కాలకృత్యాలన్నీ నేర్చుకొనే స్థితి వచ్చింది. నూతినీరు తోడుకొని స్నానం చేసినా ఆమెకు స్నానంచేసినట్లు లేదు. ఒళ్లంతా చించుకున్నట్లు - మనస్సంతా యేదో తప్పుచేసినట్లు వికారంగా వుంది. వాళ్ల యింట్లో పార్వతీశిలలు లేవు. పూజ చెయ్యటానికి బంతిపువ్వులూ లేవు. రంగు రంగుల బొమ్మలు - పుడ్తతో చేసిన హారాలూనూ. అసలు యీ యింట్లో పసుపు అనేదే కనపడలేదు. వెంకమ్మప్రక్కనే నిలబడి విధిలేక మ్రొక్కవలసివచ్చింది. పూజగది యెంత శుభ్రంగా వున్నా పూజా విధానం ఆమెకు యేమీ నచ్చలేదు.

యీ వూరులో, మనుషులూ, యిల్లూ, వస్తువులూ, వాహనాలూ అన్నీ వాళ్ల వూరులో వున్నవాటితో సరిపోల్చటానికి తబ్బిబ్బైపోతోంది. తను చూస్తున్నదీ, తను యిదివరకు చూసినదీ ఒక్కపెట్టగా వుంచి ఆలోచించబోతుంది. దుఃఖం వచ్చేటప్పుడు, అభిమానం కరిగిపోయేటప్పుడు, లేక కోరిక తాండవించేటప్పుడు అక్కడ కనపడినట్లే యిక్కడా మండే పొయ్యి, కాగే వంట పాత్రలు కనిపిస్తున్నాయ్. అక్కడ మట్టిపొయ్యి, మట్టికుండ కనిపిస్తే యిక్కడ మరింత భీకరంగా. యినపపొయ్యి, రాగి పాత్ర కనిపిస్తున్నాయి. అయినా రోజంతా ఆ వంటయింట్లో ఒకమూల కూర్చొని యీ మనుషుల్నీ మేడల్నీ చూడకుండా వాళ్ల వూళ్లో యేరునీ, వెన్నెల్నీ, వానల్నీ, పొలాలనీ, మనుషుల్నీ తలచుకోవాలని కోరిగ్గా వుండేది.

* * *

వెంకమ్మ యిల్లంతా చూపించాక వరండాలో సుందరమ్మని కూర్చోబెట్టి లాలిస్తూ అంది. "యీ యిల్లు నీ యిల్లనే మెసలామ్మా. మనుషులంకదా. యేవో తప్పులు చేస్తాం. మనసులో పెట్టుకోక నీకేం లోటుపాట్లు వచ్చిన

(33 వ-పేజీ చూడుడు)

# "మధురభారతి" మాధవపెద్దికవి



శ్రీ పెనుమర్తి కామేశ్వరరావు

"సంస్కృతి గల కవి తను రాయబోయే విషయాన్ని వచనంలో భావించి కవితగా రాస్తాడు; ప్రకృతి నారాధించే కవి తన విషయాన్ని కవితలోనే భావిస్తాడు.–" జాన్‌స్టూవర్టుమిల్.

"మధురభారతి" శ్రీమాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రిగారు 'మిల్' చెప్పినటుల రెండుతరగతులకు చెందిన గొప్పకవి. ఆయన తొలిరచన "బృందావనము" అను ఖండకావ్యసంపుటి. అందులో ఆయన రచియించిన హాస్యరసప్రధానంగా నుండే పద్యాలు ఆంధ్రుల్ని విశేషంగా ఆకర్షించినవి. "దశమాతాహారీతక" అను ఖండకావ్యం ఆయన అనేకసభలలో చదివినప్పుడు అందులో హాస్యభావముల నానందించని ఆంధ్రుడు లేడు. హాస్యరసమును సభ్యత నతిక్రమించకుండా పోషించి కవిత రాయగలవారాంధ్రులలో ఆధునికులలో చాలా అరుదు. ఆ పద్ధతిలో ఆయనదే అగ్రస్థానము. ఆయన ఎన్నో భక్తిరసప్రధాన కావ్యముల రచించి ప్రచురించి పండితపామరుల ప్రశంసలకు పాత్రమైనా, ప్రతి సభలో ప్రజలాయనను హాస్యపుపద్యాలను వినిపించమని కోరేవారు! అవి ఎన్నిసారులు విన్ననూ, మరల వినవలెనని ప్రజలకు కుతూహలముండేది. "బృందావనము"లోని కొన్ని పద్యాలు, తరువాత రచించిన కొన్ని పద్యాలు కలిపి 'చాటువులు' అను పుస్తకంగా ప్రచురితమైనవి.

ఆయన "పంచవటి"అను రామాయణకథాభాగమును ఆంధ్రవిశ్వవిద్యాలయంవారు ఇంటర్ పరీక్షకు పాఠ్యగ్రంథంగా నియమించడంతో ఆయనపేరు విద్యార్థికులలో ఇతరులలో బాగా ప్రాకినది. అది వరుసగా మూడుసంవత్సరాలు పాఠ్యగ్రంథంగా నున్నది.

ఆతర్వాత ఆయన 'ఉమర్ ఖయ్యాం' పుస్తకం వచ్చింది. ఇందులో ఆయన ఖయ్యాంవేదాంతమును గైకొని స్వతంతంగా పద్యాలు రాశారు. అవి సరాసరి ఆంగ్లలో ఫిట్జ్ గెరల్డు రచించిన "రుచియత్ కు ఓమరుఖయ్యాం" అనువాదం కావు. అంతకు ముందే శ్రీరాయప్రోలు సుబ్బారావుగారు 'మధుకలశమ్' శ్రీ దువ్వూరి రామిరెడ్డిగారు 'పానశాల' ప్రకటించియున్నారు. ఆ రెండుపుస్తకము లున్ననూ, శ్రీమాధవపెద్ది కవిగారి ఓమరుఖయ్యాం పద్యాలుకూడా రసికుల మన్ననలు పొందినవి. అందుకు కారణం, పద్యరచనలో శాస్త్రిగారికున్న ప్రావీణ్యము!

వారి పద్యాలు సరళభాషలో నడుస్తయి. కుంటువడుట కాని, అయోమయంగా నుండుట గాని, సంస్కృతపదాడంబరత్వముతో క్లిష్టముగా నుండుటగాని – యుండక అవి అతిమధురములుగా నుంటాయి. ఆయన 'మధురభారతి' బిరుదం అన్వర్థము. ఓమరుఖయ్యాం రెండసారి ప్రచురించి దానిలో చేర్పులూ కూర్పులు.– చేర్చి ఖయాం వేదాంతాన్ని విపులీకరించారు.' ఉమర్ ఖయాం'లో—

"నియతియె లేని జీవికను
 నిద్దురతో నొక కొంతకాలముక్
షయ మొనరించుకొన్న యది
 చాలునులే, యికనైన ఈ రసా
శ్రయమున మేలుకొంచు నిదు
 రక్ నిదురించుచు మేలుకొంటలో
పయన మొనర్త మన్యమగు
 పట్టనియట్టి మహాపథమ్ములన్!"

ఉమర్ ఖయాంలో అనేక శీర్షికలక్రింద పద్యాలున్నాయి.

"కాలము" అను శీర్షికక్రింద యీ పద్యము చూడుడు:

"నవయుచునుండ నొక్కపువు
 నవ్వుచు నుండె మఱొక్కపువ్వు కా
లవశత జేసిచూడు మబలా!
 యిచటన్ మరువంపు మొల్కసం
భవమయినల్లె వేఱొకట
 మన్మథమొల్కయు రాలిపోవు నీ
భువి పరికించ నెంతమది
 పొంగునొ యంతకు నంతకృంగెడిన్."

ఆ తర్వాత, ఆయన 'మృత్యుంజయం' అను పుస్తకం అచ్చయింది. ఇది శివనుతి. ఈ శతకం శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారి ప్రశంసకు పాత్రమైంది. ఇందులో ఆయన భక్తిపారవశ్యమూ – స్వానుభవమూ మేళవింపబడినయి. ఆయన నైజికహాస్య మిందు వెల్లివిరియుచున్నది. ఆయన ఈతిబాధలిందు కన్పించుచున్నవి. ఇది ధూర్జటి 'కాళహస్తీశ్వరశతకము' శ్రీ విశ్వనాథవారి 'విశ్వేశ్వరశతకము'లకు సరితూగు విషయగాంభీర్యత గలది.

ఆ తర్వాత 'శబరి' అను రామాయణకథాభాగము పుస్తకరూపముగా సర్వధారిసంవత్సరములో వెలువడింది. ఇక ఆయన సంస్కృతమునుండి అనువదించిన 'సుభాషితములు' అను పద్యాలు అముద్రితముగా నున్నవి.

శ్రీ మాధవపెద్దిబుచ్చిసుందరరామశాస్త్రి గారితో నాకు పదిసంవత్సరములనుంచీ సన్నిహితపరిచయ మున్నది. ఆయన శ్రీ తిరుపతివెంకటకవుల శిష్యులలో ప్రథమశ్రేణికి చెందినవారిలో నొకరు. శ్రీ తిరుపతివెంకటకవు లాంధ్రదేశంలో శతావధాన, అష్టావధానజైత్రయాత్రలు సాగించుచున్న కాలంలో మాధవపెద్దికవి వారివద్ద గురుశుశ్రూష చేయుచూ సంస్కృతాంధ్రముల చదివి, గురువుల యాశీస్సులను పొందినారు. ఆయన విశ్వనాథ, పింగళి – కాటూరివంటి శిష్యుడు గాక – వెంకటశాస్త్రిగారియింట నుండి – వారెక్కడకు పోయినా వారివెంట నుండి పరిచర్యలు చేస్తూ విద్యాభ్యాసం చేశారు.

ఆయనకు యౌవనవసంతంలో భార్యావియోగం ప్రాప్తించింది. కొన్నాళ్లు మిషనరీస్కూలులో ఆంధ్రోపాధ్యాయుడుగా పనిచేశాడు. భార్య మరణించడం, ఉబ్బసవ్యాధి సదా పీడించడం, ముగ్గురుకుమార్తెలకూ వివాహాలు జరపడం – పెద్ద ఆస్తిపరుడు కానందున దారిద్ర్యబాధ మిక్కుటం కావడం సంభవించి – ఆయనకవితాశక్తి ఆయనకు నలుబదివత్సరాలు దాటిన తరువాతనే బైటికి వచ్చింది. 'బృందావనం'లో ఆయన సాంసారిక ఈతిబాధలు చిత్రించబడిన

(37 వ-పేజీ చూడుడు)

సినీమా:

***********************

# కాశ్మీర్ లోయ

## భారతప్రభుత్వంవారి వర్ణచలన చిత్రం

***********************

భారతప్రభుత్వ సమాచారశాఖ ఫిల్ము డివిజన్‌వారు తీసిన 'వేల్ ఆఫ్ కాశ్మీర్' అనే టెక్నికలర్ డాక్యుమెంటరీ చిత్రం 22 వ తేదీన వెల్లింగ్టన్ సినీమా హాలులో పత్రికా ప్రతినిధులకు ప్రదర్శితమైనది.

మన దేశంలో వర్ణచిత్రనిర్మాణానికి ప్రథమయత్నాలలో ఇదొకటి. ప్రకృతి తన సహజసౌందర్యాన్ని నలుముఖాలా వికసింప చేసుకున్న దీ ప్రాంతంలో.

మొదట కాశ్మీర్ కేంద్రం శ్రీనగర్ సాక్షాత్కరిస్తుంది. తీర్చి దిద్దిన బజారులు, సంస్థానపు మూలమూలలనుంచి వచ్చిన రమ్యమైన శాలువలు, తివాసీలు, పాత్రలు, ఇంకా రకరకాలసామగ్రి కనిపిస్తాయి. ప్రతివస్తువు ఒక కళాఖండం. తరువాత నగరంలోని పుష్పోద్యానాలు; షాలిమార్ గార్డెన్స్ అందం వర్ణనాతీతం. నగరమధ్యాన ప్రశాంతంగా ప్రవహించే జీలంనదిలో నౌకావిహారం చేస్తూ అసంఖ్యాకయువకులు. నగరంలో ఒకనాల నించిచూసినా తెల్లనిమంచుకొండలే. విమానమొకటి శ్రీనగర్-లేహ్ మార్గమధ్యంలో దుర్గమారణ్యాలు, అగాధకందరాలు మహోన్నత శృంగాలు కనిపిస్తాయి. టిబెటియన్ స్త్రీలు, బాలురు మారంసంచి మునిముసినవ్వులతో స్వాగతమిస్తారు. త్రోవలో 26 వేల అడుగుల ఎత్తుగల నంగపర్వతం దృశ్యమౌతుంది. ఇక హైశ్యకాలడీ మంచు కొండలు, లోయలు నిశ్శబ్దగంభీరప్రకృతి.

వర్ణసంకలనంతో చిత్రం మరీ రాణించింది. ముఖ్యంగా ప్రతిపండు కుమ తోటలు, జీలంనది, కొండలు వసంతాగమనం నాల బాగున్నాయి. వర్ణసంకలనం పూర్తిగా నిర్దుష్టంగానూ, సహజంగానూ ఉన్నదని చెప్పలేము. కొన్నిచోట్ల రంగు మరీ దట్టంగానూ అర్థరహితంగాను ఉన్నట్లు, ఛాయాగ్రహణం స్పష్టంగా ప్రేక్షణీయం కానట్లు గుర్తిస్తాము. కాని ఇది ప్రథమయత్నం.

చిత్రమంతా సుందరదృశ్యాలతో నే నిండిపోయింది. రిలీఫ్‌కోసం ప్రజలు, వారి వృత్తులు, సాంఘికజీవితం, ఆచారాలు, పల్లెటూళ్ళు మున్నగువాటిని ఇంకా వివరంగా చిత్రిస్తే చిత్రం మరింత రక్తి కట్టేది. [నం. రా.]



శోభనాచల & ఎం. ఆర్. ఏ. ప్రొడక్షన్సువారి 'లక్ష్మమ్మ'లో యిల్లాలుపాత్ర ధరించిన కృష్ణవేణి.

శోభనాచల & ఎం. ఆర్. ఏ. ప్రొడక్షన్సువారి "లక్ష్మమ్మ" చిత్రంలో కుమారి రుక్మిణి.





1. చీకటిలో ధ్వనిసహాయంతో తీగల్ని తగలకుండా ఎగరగల గబ్బిలం.



4. నీటిలోపలికళ్లు, వాసనవల్ల వస్తువుల్ని కనిపెట్టగల చేప.

# భూచర జలచరాల్లో ఇంద్రియ జ్ఞానం

['లైఫ్' పత్రిక నుంచి]

మానవునిలో సమరీతిని తనుమాత్రంగా వృద్ధిపొందిన ఇంద్రియ జ్ఞానం భూచరజలచరాల్లో వికృతి పొందాయి. చూపు, వినికిడి, రుచి, వాసన, స్పర్శ ఈ అయిదూ మానవునిలో నే సమపాళ్లలో ఉన్నాయి. కాని చూపులో గద్దకు మానవుడు తీసికట్టే. అరమైలుదూరంలో కల చిన్న ఎలుకని గద్ద స్పష్టంగా చూడగలదు. కాని గద్దకు వాసనాశక్తి బహుఅల్పం. కొన్నిరకాల చేపలకు దృష్టి బొత్తిగా ఉండదు. కాని ఘ్రాణశక్తి అపారం. ఎద్దుల్ని కళ్లుండడు నష్టనా ఇటూ అటూ ఎగురుతాయని ఊహిస్తున్నారు. కాని నిజంగా ఎగురుతున్నదేనా వలయను దేనో వివరంగా తెలియదు.

ఈ ప్రక్క కొన్ని జీవాల ఇంద్రియ జ్ఞానాన్ని పరీక్షించే చిత్రాలున్నాయి.

1. ధ్వని చీకటినిటిలో అనుసంధానం గల చక్రాల్ని అడ్డంగా పెట్టినా గబ్బిలం చక్రాలకు తగ్గలం తగలకుండా ఎగుర గలదు. మన చెవులకుకూడా అందనంత ఎక్కు వగా గబ్బిలం అరుస్తుంది. ఆ ధ్వనికి చక్రాలు ప్రతిధ్వనిస్తాయి. ఆ ప్రతిధ్వని సహాయంతో కన్ను పొడుచుకున్నా కనపడని చీకటిలో గబ్బిలం చక్రాలకి తగ్గలు తగలకుండా ఎగరగలదు.

2. స్పర్శ: కట్లపాముల్లోనూ, కొన్ని కీటకపాముల్లోనూ స్పర్శజ్ఞానం అధికం. రెండుకళ్లమధ్య ఒక చిన్న గొట్టి ఉంటుంది. అక్కడే విచిత్రమైన అంగముంటో కాని దాని సహాయంతో వేడిమిని కనిపెట్టగలదు. ప్రక్కచిత్రంలో ఒక కట్లపాము కన్నుల్ని మూడితో మూసివేశారు. వెలుగుతున్న బల్బు ఒకవైపున, ఆరిపోయిన బల్బు ఒకవైపున



సూక్ష్మంగా వేడిమిని కనిపెట్టగలకట్లపాము.

తిప్పుతుంటే, పాము
బల్బుపైన కాటు
్పుడు వెలిగించిన బల్బు
పాము కనిపెట్టగలదు.
ప్రాణికోటిమాదిరిగా
నే చూపు, వినికిడి,
సమంగా వృద్ధి
సంజ్ఞలద్వారా
కొన్ని కోతు

క్క చిత్రంలో చేప
నూనె వేసినందువల్ల
హారాన్ని గమనించలేక
వేపలు సమీపవస్తువుల్ని
రంతో గ్రహించగలవు.
వురాలకు కంటినిండా

పాప ఉంటుంది. అందువల్ల ప్రక్కలకు దృష్టి తిప్పకోడానికి తలనే త్రిప్పకుంటుంది. ఎగరడంలో బరువు సమంగా ఉంచడానికి తల ఉపయోగపడుతుంది. వేలిమీద పావురాన్ని నిలబెట్టి ఏ ప్రక్కకు ఊంచినాసరే పడిపోకుండా వీలుగా తలను తిప్పుతుంది. ముక్కెప్పుడూ భూమికి నిలువుగానే ఉంచుతుంది.

6. నొప్పి: కొన్నిరకాల తూనీగలకి బొత్తిగా స్పర్శజ్ఞానం లోపించింది. తూనీగని రెక్కలతో పట్టుకుని నెమ్మదిగా దాని తోకనే దాని నోటికందిస్తే, అంది నంతవరకూ తోకని తినేస్తుంది. రక్తం లైనా నొప్పి కలగదు. కాని త్వరలోనే అది చచ్చిపోతుంది. మెదడు వృద్ధికాని అనేకప్రాణులికి నొప్పి ఉండదు. కాని వాటికి తెలి



ృనా పడకుండా నిలవగల పావురం. చూచేశక్తి అధికం.



3. కొద్దిగా బుద్ధి నార్జించుకుని సంజ్ఞలు తెలుసుకోగల కోతి.

యని స్పర్శజ్ఞానం కొద్దిగా ఉంటుంది. నికి బానల అది తిన్నదు. స్పర్శజ్ఞానం
కప్పని జౌషధంలో ముంచి స్పృహ వల్ల, ఏలుగుపాముని రెండుగా తెగవేస్తే
లేకుండా చేసినతరవాతకూడా, సూదితో నిశ్చింతగా రెండు ముక్కలూ ఏబాధా
నన్ను తాకగానే కాళ్లెత్తి తన్నుతుంది. నిజా లేకుండా దేనిదారిని అది పోతుంది.



6. తన తోక తాను తింటూ నొప్పి తెలియని తూనీగ.

లక్షలాది ప్రాణాల్ని హతమార్చగల

# హైడ్రోజన్ బాంబు

హైడ్రోజన్ బాంబు నిర్మాణానికి అమెరికా ప్రెసిడెంట్ ట్రూమన్ అజ్ఞ ఇచ్చాడు. దీనితో అమెరికా, యూరప్, రష్యాలలో విపరీతమైన సంచలనం ప్రారంభమయింది. హైడ్రోజన్ బాంబుని రష్యా కూడా తయారు చెయ్యగలదు. కాని రష్యా తయారు చేసేలోగా అమెరికా తయారు చెయ్యటం అవసరమని ట్రూమన్ ఎటామిక్ ఎనర్జీ కమిషన్ని హెచ్చరించాడు. అందువల్ల మూడో ప్రపంచ యుద్ధం సన్నిహితమైనదనే భయం సర్వత్రా వ్యాపించింది. ఈ పోటీలు పడ్డంకంటె ఏదోరీతిని రష్యాతో సమాధానం చేసుకోవడం అవసరమని అమెరికన్ కాంగ్రెస్ ట్రూమన్ ప్రభుత్వాన్ని ఒత్తిడిచేస్తున్నది. యూరప్ లో కూడా రష్యాతో సమాధానం అవసరమనే అభిప్రాయం ఏర్పడుతుంది. ఎన్నికల్లో ప్రజల్ని మభ్యపుచ్చడానికి కాని మరొక హేతువు వల్లగాని బ్రిటిష్ యుద్ధనాయకుడు విన్స్టన్ చర్చిల్ స్టాలిన్‌తో సఖ్యతకు యత్నం చెయ్యవలసిన అగత్యం ఉందని చెప్తున్నాడు. మొత్తానికి ప్రపంచమంతటా హైడ్రోజన్ బాంబు పేరు చెప్పేసరికి భయం ఆవహించింది. హైడ్రోజన్ బాంబుల సహాయంతో రష్యా అమెరికాలు యుద్ధానికి దిగినట్లయితే మానవులు అనేక శతాబ్దాలుగా శ్ర మ్పద మా లకులోనై రూపొందించుకున్న ఆధునిక నాగరికత నిర్మూలమైపోగలదని అన్ని దేశాలవారూ భీతి చెందుతున్నారు. ప్రపంచానికింత ఉత్పాతం తెచ్చిపెట్టగల ఆ బాంబు ఏమిటి? ఇంతటిశక్తిని విజ్ఞానశాస్త్రవేత్తలెలా సృష్టించగలిగారు?

ఆకాశంలో మెరుస్తున్న లక్షలాది నక్షత్రాలలో సూర్యుడు ఒక చిన్న నక్షత్రమని శాస్త్రజ్ఞుల భావన. అనేకకోట్ల సంవత్సరాలుగా కాంతినీ ఉష్ణాన్నీ ప్రసరింపచేస్తున్న సృష్టికర్త సూర్యభగవానుడు. సూర్యునిలో నిత్యమూ అపారమైన శక్తి ఉద్భవిస్తూ ఉంటుంది. సూర్యునిలో ఈ కాంతి ఎలా వచ్చింది? సూర్యునిలో అక్షయమైన శక్తి ఉందన్నమాట. ఈ కాంతి ప్రసారానికీ, శక్తిసృష్టికీ ఏ మూలకారణమో అవే హైడ్రోజన్ బాంబువల్ల వినాశకరమైన మహాశక్తి ఉద్భవించడానికి కూడా కారణం.

సూర్యునిలో గల అపారమైన వేడిమి అక్కడి పదార్థంలో నిత్యపరిణామం సంభవిస్తోంది.

ముఖ్యంగా, హైడ్రోజన్ (ఉదజని వాయువు) వేడిమివల్ల హీలియంగా మార్పు పొందుతోంది. ఈ మార్పులో కొంత పదార్థానికి పదార్థగుణం నిర్మూలమై అదే మహాశక్తిగా పరిణమిస్తోంది.

అసలు సూర్యుడే ఒక పెద్ద హైడ్రోజన్ బాంబు అని విజ్ఞానశాస్త్రవేత్తల అభిప్రాయం. సూర్యునిలో జరిగే ఇక్కడ కూడా హైడ్రోజన్ పరమాణువుల్ని బ్రద్దలుకొట్టి హీలియం పరమాణువులుగా మార్చగలిగినట్లయితే, ఈ మార్పులో కొంత పదార్థం నాశనమై శక్తిని ఉద్భవింపచేయవచ్చునని శాస్త్రజ్ఞులేనాడో కనిపెట్టారు. కాని పరమాణువుల్ని ఛేదించడం ఎలాగో ఇంతవరకూ బోధపడలేదు. సూర్యునిలో అయితే ఎల్లప్పుడు వేడిమి రెండుకోట్ల డిగ్రీలుంటుంది కొబట్టి (భూమిపై వాతావరణంలో వేడిమి దాదాపు 60 డిగ్రీలు మాత్రమే ఉంటుంది) అక్కడున్న హైడ్రోజన్ దానంతటదే విచ్ఛిన్నమై కాంతినీ శక్తినీ ఉద్భవింపచేస్తుంది. కాని భూమిపైన అంతటి వేడిమిని సృష్టించడం అసాధ్యం. అయితే ఏటంబాంబు ప్రేలుడుతో అంత వేడిమి సృష్టించి హైడ్రోజన్ పరమాణువుల విచ్ఛిత్తికి అవకాశం ఏర్పడింది, అంటే తుపాకీకి మీట ఎలాగో హైడ్రోజన్ బాంబుకి ఏటంబాంబు అలా అవసరం. ఒక హైడ్రోజన్ బాంబును భూమిపైన పేల్చగలిగితే సూర్యాంశను కొంతసేపు భూమికి ఆపాదించవచ్చును.

ఏటంబంబుకి హైడ్రోజన్ బాంబుకీ ముఖ్యమైనవి ఒక పోలిక ఒక వ్యత్యాసం ఉన్నాయి. రెండింటి పరమాణువుల పరిణామం అనంతరం బరువులో తగ్గిపోతాయి. ఉదజనుఫలాల్ని ఒక్కసారి తూస్తే ఎంత

## మానవుడు మళ్లీ మొదటికొస్తున్నాడా?



రాతియుగం. గుర్రాలు, కత్తులు. తుపాకులు. టాంకులు.

బరువుంటుందో ఫలాల్ని విడివిడిగా తూచి కూడినట్లయితే అంత బరువుండదనుకోండి. మిగతా బరువు ఏమైనట్లు? యురేనియంపరమాణువువిచ్ఛిత్తిలో ఇదే కనిపిస్తుంది. ఆ బరువుగల యురేనియం పదార్థరూపం విడిచి రూపంలేని శక్తిగా పరిణమించిందన్నమాట. పదార్థం వాస్తవంగా కరుడుగట్టి రూపం పొందినశక్తి అని ఐన్‌స్టైన్ నిరూపించాడు.

యురేనియంపరమాణువును ఛేదించినప్పుడు క్రిప్టాన్, బేరియం పరమాణువులు ఏర్పడతాయి. మొదట యురేనియం పరమాణువు బరువును చూసి, తర్వాత ఏర్పడిన క్రిప్టాన్, బేరియం పరమాణువుల బరువును చూస్తే ఈ రెండింటి బరువుల మొత్తం మొదటిదాని బరువుకంటె తక్కువుంటుంది. మిగతాపదార్థం శక్తికింద పరిణమించిందన్నమాట.

హైడ్రోజన్ పరమాణువిచ్ఛిన్నంలో కూడా పదార్థం శక్తిగానే మారుతుందిగాని, దానికి జరిగే మార్పు వేరు. యురేనియం పరమాణువు విచ్ఛిన్నమైతే రెండు పరమాణువులేర్పడతాయి. కాని బరువైన హైడ్రోజన్ ఒక పరమాణువులోని పదార్థం రెండుపరమాణువుల్లో చేరి హీలియంపరమాణువు లేర్పడతాయి. (అంటే ఈమారు రెండుబుట్టల్లో ఉన్న ఫలాల్ని విడివిడిగా తూచి, తరవాత అన్నిటినీ కలిపి తూచినట్లయితే మొదటి మొత్తం బరువుకంటె రెండోసారి బరువు తక్కువగా ఉన్నట్లవుతుంది.) బరువైన హైడ్రోజన్ని డ్యుటీరియమ్ అంటారు. డ్యుటీరియంలో ఒక ప్రోటాన్, ఒక న్యూట్రాన్ ఉంటాయి. రెండు డ్యుటీరియమ్ పరమాణువుల్ని కలిపి తగినంత వేడిమి కలిగించినప్పుడు రెండు ప్రోటాన్లు, రెండు న్యూట్రాన్లు గల ఒక హీలియంపరమాణువుగా మారతాయి. కాని రెండు డ్యుటీరియం పరమాణువుల మొత్తం బరువుకంటే ఒక హీలియంపరమాణువుబరువు తక్కువగా ఉంటుంది. ఇక్కడకూడా తరిగిపోయిన మట్టుకు బరువుగల పదార్థం శక్తిగా మారిపోయిందన్నమాట.

మొదట చెప్పినట్లు యురేనియం పరమాణువును బద్దలుగొట్టి విపరీతమైన శక్తిని పుట్టించే పద్ధతి ఏటంబాంబుల్లో ఉపయోగించబడింది, రెండో పద్ధతిని డ్యుటీరియమ్ (బరువైన హైడ్రోజన్) పరమాణువుల్ని కలిపి చేర్చి హీలియంగా మార్చి శక్తిని సృష్టించేపద్ధతి హైడ్రోజన్ బాంబుల్లో ఉపయోగించబడుతుంది.

హైడ్రోజన్‌పరమాణువులు బ్రద్దలై హీలియంపరమాణువులుగా మారుతూ, ఎప్పటికప్పుడు తరిగిపోయిన బరువుగల పదార్థం తేజస్సుతోనూ, ఉష్ణంతోనూ శక్తిగా మారిపోవడం నిత్యం సూర్యునిలో జరుగుతూఉంటుంది. సూర్యునిలో నిత్యమూ వేడిమి రెండుకోట్ల డిగ్రీలు (సెంటిగ్రేడ్) ఉంటుంది. అంత వేడి ఉన్నందువల్ల అక్కడ నిత్యమూ పరమాణువులు బ్రద్దలౌతూనేఉంటున్నాయి.

పూర్వంకూడా శాస్త్రజ్ఞులికి సూర్యునిలో కలుగుతున్న ఈ మార్పుల్ని గురించి తెలుసును. కాని అంతటి వేడిమినీ మహాశక్తినీ భూమిపైన ఎలా సృష్టించాలో వారికి ఇంతవరకూ తెలిసింది కాదు.

మొట్టమొదట ఏటంబాంబు (యురేనియంబాంబు) 1945 జూలై 16 వ తేదీని న్యూమెక్సికోలో ప్రేల్చి చూశారు అమెరికన్ విజ్ఞానశాస్త్రవేత్తలు. అప్పుడు కావలసినంత వేడిమిని ఏటంబాంబుసహాయంతో భూమిపైనకూడా కలిగించవచ్చునని తెలిసింది. అప్పటినుంచే అమెరికాలో హైడ్రోజన్ బాంబు నిర్మించడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

కాని హైడ్రోజన్‌బాంబుని నిర్మించడం సామాన్యమైన పని కాదు. సూర్యునిలో అయితే నిత్యమూ అక్కడ వేడిమి అధికంగా ఉంటుంది కాబట్టి హైడ్రోజన్ దానంతటదే బ్రద్దలౌతుంది. భూమిపైనయితే చాలా సమస్యలున్నాయి. యురేనియంబాంబు పేలి వేడిమి పుట్టే సమయానికి, హైడ్రోజన్ (డ్యుటీరియం) సిద్ధంగా ఉండాలి.

ఈ హైడ్రోజన్‌బాంబులో ఉపయోగించబడే పదార్థాల్లో ముఖ్యమైనది ట్రిటియమ్ హైడ్రోజన్ పరమాణురూపాల్లో ఒకటి. ట్రిటియంలో ఒక ప్రోటాన్ రెండు న్యూట్రాన్లు ఉంటాయి.

దీన్ని మామూలు హైడ్రోజన్‌లోని (ఒక ప్రోటాన్ ఒక న్యూట్రాన్) ప్రోటాన్ ఢీకొన్నప్పుడు రెండూ కలిసి హీలియం ఏర్పడుతుంది. ట్రిటియం కాక డ్యుటీరియం లిథియంలుకూడా ఉపయోగపడతాయి. వీటినన్నిటినీ యురేనియం (మామూలు ఏటంబాంబులో వాడేది) చుట్టూ పేర్చాలి. అప్పుడు యురేనియంబాంబు మీటగా పని చేస్తుంది. హైడ్రోజన్ ప్రచ్ఛన్నవాయురూపంలో ఉంటుంది. అందువల్ల రసాయనికమిశ్రమాల్ని వాడవలసిరావచ్చును.

యురేనియం పేలినప్పుడు వేడి కోట్ల డిగ్రీలకు పెరిగిపోయినప్పుడు చుట్టూ పేర్చబడిన రసాయనికపదార్థాలు పేలి ప్రోటాన్లు

(36 వ పేజీ చూడుడు)

(యుద్ధ పరికరాల అభివృద్ధి)

—న్యూయార్కు టైమ్స్‌నుంచి.




బాంబులు. ఏటంబాంబు హైడ్రోజన్ బాంబు. మళ్లీ మొదటికి.




# హిమకన్య

శ్రీ చె. వెంకటరామయ్య

మంచుగడ్డలు 'ఆకాశంనుండి రాలే రోజులవి. అనగా మంచి శీతాకాలం. అటువంటి సమయంలో ఒక రాణి నల్ల చేవమాని కుర్చీలో ఆసీనురాలై పడే మంచుగడ్డముక్కలను పరాకుగా చూస్తూ కుట్టుపని చేసుకుంటూవుంది. ఆమె పరాకుచిత్తగించినందుకు ఫలితంగా సూది చురుక్కున వేలికి గ్రుచ్చుకుని బొటబొట నెత్తురుకారింది. ఆనెత్తురు చుక్కలు మూడు జారి మంచుగడ్డమీద పడినవి. తెల్లని మంచుమీద యెఱ్ఱని రక్తబిందువులు యెంతో ముచ్చటగా కనిపించినవి. వెంటనే రాణీ "యెఱ్ఱని రక్తపు రంగు పెదవులు, మంచుగడ్డవంటి తెల్లని శరీరచ్ఛాయ, నల్లచేవరంగు శిరోజాలు కలిగిన అమ్మాయి కలిగితే బాగుండును" అనుకుంది. కొన్ని రోజులకు ఆవిధంగానే అమ్మాయి పుట్టింది రాణీకి. తెల్లని రంగు, యెఱ్ఱని పెదవులు, నల్లని శిరోజాలతో ఆ పాప చాలా అందంగా వుంది. ఆమెకు "హిమకన్య" అని నామకరణం చేశారు. కొద్దిరోజులకు రాణి చనిపోయింది. రాజుగారు ఇంకో భార్యను పెండ్లాడాడు. ఆమెకూడా అందకత్తె. అయితే తనకన్నా అందకత్తె యెవరైనా వుంటే చూచి ఆమె ఓర్చలేదు.

ఆ రాణీవద్ద ఒక వింత అద్దం వుంది. అది నిజం తప్ప మరేమీ మాట్లాడదు. ఆమె అప్పుడప్పుడు అద్దంముందు ముస్తాబై నిలచి యిలా అడగడం అలవాటు.

"వింతైనఅద్దమా!
వినిపించు నాకు
అందాన నాలాటి
అతివ లున్నారా?"

అందుకు అద్దంకూడా యిట్లా క్రింది జవాబు చెప్పడం మామూలు.

"లేదమ్మ ఓరాణి!
లేదులే దమ్మా
నీకు నీవే సాటి
నిజ మిది సుమ్మా."

ఈ మాటలు విని మైమరచిపోయేది క్రొత్తరాణి. హిమకన్య నానాటికీ పెరిగి పెద్దదై "అందాలభరిణ" అనిపించుకున్నది. సవతితల్లి కన్నా మించిపోయింది రూపరేఖా విలాసాలలో. అందరూ ఆమెఅందాన్ని పొగిడేవారే. ఒకనాడు రాణి అద్దంముందు నిలిచి మామూలు ప్రశ్న వేసింది. ఈసారి అద్దం,

"హిమకన్యామణిఅందముందర
హీనులుకారా రాణులుకూడా,"

అని జవాబిచ్చింది.

మాత్సర్యంతో రాణి ఒక రాజభటుని పిలిచి హిమకన్యను అడవికి తీసుకొనిపోయి చంపి, నాలుక, గుండె, గుర్తుకుగాను తెమ్మని డబ్బిచ్చి పంపింది. వాడావిధంగానే హిమకన్యను అడవికి తీసుకొనిపోయి

కత్తితో నరకబోగా, ఆమె యేడుస్తూ "నన్ను ప్రాణంతో వొది లేస్తే యెక్కడికైనా పోయి మళ్లీ రాణీకంటికి కనిపించ"నని మొరపెట్టు కుంది. కరకువాని కఠినహృదయం కరిగింది. అమ్మాయిని విడిచి పెట్టాడు. ఒక అడవిపందిపిల్లను చంపి, దానిగుండె, నాలుక చూపి రాణీగారి మెప్పు పొందాడు.

తల్లిలేని హిమకన్య అరణ్యంలో ఆకలిదప్పులు పీడించినా సహించి ప్రయాణం సాగించింది భగవంతుని పైన భారం వేసి. అడవిలో మృగా లెన్నో కనిపించాయి. కాని అవి ఆమెకేమీ ఆపద కలిగించలేదు. చీకటిపడింది. అప్పటికి ఒక చిన్న యిల్లు కనిపించింది. బెదురుతూ ఆయింట్లో ప్రవేశించింది. ఆయింట్లో వస్తువులన్నీ చాలా చిన్నవి. అయితే చాలా అందంగా, నాజూకుగా సర్ద బడిఉన్నాయి. మధ్యలో ఒకహాలు. అందులో ఒక బల్లమీద తెల్లని దుప్పటి పరచి, దానిమీద ఏడు చిన్న కంచాలు, యేడు చిన్న చంచాలు అమర్చబడి ఉన్నాయి. వాటిప్రక్కన యేడు చిన్న లోటాలు. గోడకు అనుకొని యేడు చిన్న మంచాలు. ఆ మంచాలమీద మెత్తలున్నూ, దిండ్లు కనబడినవి. ఆయింట్లో యేడుగు రున్నారనీ, అవి వారి తాలూకు ఆహారపానీయాలు, నిద్రాసౌకర్యాలనీ గుర్తించింది రాజకుమారి. వారిలో యే ఒక్క రికీ ఆహారలోపం రానీయకూడదని, ఒక్కొక్క కంచంలోనుండి ఒక్కొక్క ముద్ద అన్నం తిని ఒక్కొక్క లోటాలోని నీటిని ఒక్కొక్క గుక్కెడు తాగి, ఆకలి దప్పులు తీర్చుకుంది. అన్నం నోట్లో పడి ఆకలి అణగగానే నిద్ర వచ్చింది. ఏడుపడకలలో ఏది చూచినా కడ పటిది తప్ప తక్కినవి తనకు సరిపో లేదు. ఒకటి చిన్నది, ఒకటి పెద్దది, ఒకటి దిండు యెత్తు జాస్తి, మరొకటి తక్కువగా కనిపించాయి. అందుచేత



తన కన్నివిధాలా సరిపోయిన చివరి మంచంమీద మేను వాల్చి నిద్ర పోయింది.

బాగా రాత్రి అయ్యేసరికి ఏడు గురు మరుగుజ్జులు వచ్చారు. వారి కింట్లో తమ వస్తువులన్నీ తారు మారుగా కనిపించాయి. ఒకరికి కొంచెం రొట్టెముక్క తగ్గింది. ఇం కొకరికి ముద్దఅన్నం లోపించింది. మూడవవానికి పులుసులో ముక్కలు కనిపించలేదు. నాలుగో కంచంలో పచ్చడిముద్ద కనబడలేదు. అయిదో కంచంలో అప్పడం లేదు. ఆరో కంచంలో ఆవకాయముక్క లేదు. ఏడోవానికి నీరునిమ్మకాయ పూట అయింది. ఉన్నదానితో సర్దుకొని పడకలవంక తిరిగారు. ఒకరి దిండు కదిలింది. ఒకరి దుప్పటిమడత చెదిరింది. మరొకరి మంచం కాస్త స్థానం తప్పింది. ఇలా వారు తంటాలు పడుతూండగా కడపటివాడు వచ్చి ఆశ్చర్యంతో తన పడకమీద అంద మైన అమ్మాయిని తక్కినవారికి చూపించాడు. మరుగుజ్జు లేడుగురికీ మహదానందం కలిగింది. అంతటి అందమైన అమ్మాయి వారింటికి పిలవనిపేరంటంగా వచ్చింది. ఆమె నిద్రకు భంగంరాకుండా కడపటి మరుగుజ్జు తక్కినవారిమంచాలమీద



"దాగుడు మూతలు" —పి. రఘువరావు

నిద్రపోయారు. తెల్లవారింది. అమ్మాయి లేచింది. మరుగుజ్జులు హిమకన్యకు జరిగినదంతా చెప్పి, ఆమె కథంతా విన్నారు. తమ వంట, వార్పు, తక్కిన సదుపాయాలు చూస్తూ ఆమెను అక్కడే వుండమన్నారు. ఆమె సమ్మతించింది. రాణి చాలా జిత్తులమారి కాబట్టి, ఆమెను జాగ్రత్తగా వుండమని చెప్పి వారు తమ పనులమీద వెళ్ళారు.

కోటలో రాణి, హిమకన్య మరణించిందనే నమ్మకంతో చాలా సంతోషించింది. మళ్ళీ అద్దంముందు నిలిచి ప్రశ్నించింది. అందుకు అద్దం నిజం పలికింది మళ్ళీ:—

"కొండలకోనల మధ్యనతిరిగే
మరుగుజ్జుల మధ్యన పెరిగే
హిమకన్యామణిఅందముందర
హీనులు కారా రాణులుకూడా!"

ఈమాటలు విన్న రాణికి అరికాలిమంట నెత్తికెక్కింది. ఏదో మోసం జరిగి, రాజకుమారి తప్పించుకున్నదని తెలుసుకున్నది. వెంటనే ఆమె పువ్వులమ్మే అవ్వ వేషం ధరించి పూలహారాలు తీసుకొని కొండలు, కోనలు దాటి మరుగుజ్జుల యింటికి వెళ్ళింది. పూలమాలను

అమ్మజూపింది. హిమకన్య మోసం గుర్తించలేదు. హారం కొన్నది. అవ్వ తియ్యనిమాటలు చెప్పి, తన చేతులతో అమ్మాయికి పూలదండ వేసేమిషతో, ఆమె కంఠానికి హారాన్ని గట్టిగా బిగించింది. ఊపిరి పీల్చనీకుండా, హిమకన్య తెలివితప్పి పడగానే అక్కడనుండి రాణి పలాయనమంత్రం పఠించింది. మరుగుజ్జులు వచ్చి చూసేసరికి అమ్మాయి కంఠానికి బిగింపబడిన వుచ్చు కనబడింది. వెంటనే దాన్ని కోసివేసి హిమకన్యప్రాణాలు రక్షించారు. మరునాడుకూడా రాణీ రావచ్చును కాబట్టి, గడపదాటి కాలు కదల్చవద్దని యెచ్చరించి తమ పనులపై వెళ్ళిపోయారు. రాణి తన ఇంటికి పోయి మారువేషం తీసేసి అద్దాన్ని ప్రశ్న వేసింది. అద్దం ఇదివరకు చెప్పిన జవాబే చెప్పింది. తన పాచిక పారనందుకు రాణి కోప మెక్కువైంది అసూయకూడా శృతిమించింది.

ఈసారి ఎట్లాగైనా పంతం నెగ్గించుకోవాలని గట్టిప్రయత్నం చేసింది. ఈసారి విషపు దువ్వెన ఒకటి తయారుచేసి, చక్కని రంగులు పూసింది. పేదరాసిపెద్దమ్మవేషం వేసుకుని మరుగుజ్జుల మకాముకు పోయి తలుపు తట్టింది. "దువ్వెనా వద్దు, గివ్వెనా వద్దు పో" అని చెప్పింది హిమకన్య. "కొనకున్నా దీనిని చూస్తే చాలు నని" పైకి తీసింది రంగుల దువ్వెనను రాణి. పాపం పసిపిల్ల ఆ దువ్వెన చాలా ముచ్చటగా కనిపించేసరికి కొన్నది. "ఒక్కసారి నీ తల దువ్వుతా" నంటూ మాయలాడిముసలిది విషపు దువ్వెనను హిమకన్యతలలో పెట్టి ఒక్కసారి దువ్వేసరికి విషం పనిచేసింది. హిమకన్య స్మృతితప్పి నేలమీద పడిపోయింది. రాణి పారిపోయింది. మరుగుజ్జులు వచ్చి చూచేసరికి హిమకన్యస్థితి చాలా ప్రమాదంగా ఉంది. బాగా పరీక్షించి చూచేసరికి తలలో విషపు దువ్వెన కనబడింది. వెంటనే దానిని లాగేసి వైద్యం చేసి ఆనాటి గండం తప్పించారు. కోటలో రాణి మళ్ళీ తన యెప్పటి ప్రశ్ననే అద్దాన్ని అడిగితే, "హిమకన్యే అందకత్తె" అనే జవాబే చెప్పింది.

ఈమారు ప్రయత్నంలో తిరుగు లేకుండా వుండాలని బాగా ఆలోచించి, రాణి చక్కని "ఆపిల్" పండు నొకదాన్ని కృత్రిమంగా తయారుచేసింది. అందులో ఒక భాగం కాలకూటవిషంతో నింపింది. ఆ పండుయొక్క రంగు, పుష్టి చూచి యెవరికైనా నోట నీరూరకమానదు. ఆ పండును చేత పట్టుకొని పల్లెటూరి ముసలమ్మవేషంతో హిమకన్యయింటికి పోయి "పండు కొంటారా?" అని అడిగింది. "పండ్లూ, ఫలాలతో పనిలేదు పో" మ్మన్నది రాజకుమారి. "కొనకుంటే మానె, తినకుంటే మానె-మాపండు కంటితో చూస్తే కడుపు నిండుతుంది. అని పైకి తీసి సగం కోసి విషంలేని ముక్కను తాను తింటూ కాస్త రుచి చూచి పొమ్మంటూ ఒక ముక్క (విషంవైపుది) హిమకన్య కిచ్చింది. ఆమె ఆముక్కను నోటిలో వేసుకుందో లేదో వేరుతెగిన వృక్షంలాగు కూలిపోయింది. రాణి కాలికి బుద్ధి చెప్పింది. కోట చేరగానే అద్దాన్ని అడిగింది. అద్దం యీసారి "నీకు నీవే సాటి నిజ మిది సుమా" అని బదు లిచ్చింది. నిజానికి ఆసమయానికి హిమకన్య తెలివితో లేదు.

మరుగుజ్జులు వచ్చి చూశారు. తలలో దువ్వెన వుందా అని చూశారు. మెడకు తాడు బిగించిందేమో నని వెతికారు. గాయాలున్నాయేమో నని పరీక్ష చేశారు. ఈసారి వారివైద్యాలు ఫలించలేదు. అందాల బిడ్డ మరణించిం దని నిశ్చయించారు. అన్నాహారాలు మాని అలమటించారు. కాని ఫలితం శూన్యం. పోయిన ప్రాణం రాదు కదా? "ఇంతటి అందకత్తెను నల్లని మట్టిలోనా పాతిపెట్టడం?" అని విలపించారు. అందుకు చేతులాడక ఆమెను ఒక అద్దాలపెట్టెలో భద్రపరిచారు. దానిపై బంగారపు టక్షరాలతో ఆమె పేరు చెక్కించారు. నిద్రలో నున్న సుందరివలె, అందం, శరీరకాంతులు చెక్కుచెదరలేదు హిమకన్యకు. వారు వంతులువేసుకొని ఆ శవపేటిక వద్ద కాపలా కాస్తూ వున్నారు. సుషుప్తసుందరి సమాచారం దేశదేశాలూ ప్రాకిపోయింది.

కొంతకాలానికి ఒక చక్కని రాజకుమారుడు పరివారంతో ఆ అరణ్యంగుండా ప్రయాణం చేస్తూ ఆమెకథ విన్నాడు. హిమకన్యకన్నా సుందరనారిని అతడు చూసిఉండలేదు. ఆ అద్దాలపెట్టెను తన కిస్తే ఎంతధనమైనా ఇస్తా నన్నాడు. మరు

(36 వ పేజీ చూడుడు)

బాలవిజ్ఞానం :



# అంగారకుడు, ఇద్దరు చందమామలు

శ్రీ భైరవభొట్ల రామబ్రహ్మశాస్త్రి

"అన్నయ్యా! నువ్వెప్పుడు కథ చెప్పమన్నా చెప్పనే చెప్పవు. ఎప్పుడన్నా చెప్పావంటే మా కర్థంకాని కథ చెప్తావు. ఒక మంచికథ చెప్పవూ!"

"సరే అయితే అట్లాగే చెప్తా విను. అంగారకుడి కథ."

మనలోకానికిపైన ఉండేది అంగారక లోకం. దానినే కుజలోకం అని కూడా అంటారు. ఆలోకంలో పిల్లల్ని గురించి చెప్తాను. మనకు రాత్రి 7 గంటలవటంతోటే తూర్పువైపుకు చూస్తే, కన్యారాశినక్షత్రాలు కనిపిస్తాయి. వాటిదగ్గరగానే బాగా ఎర్రగా మెరుస్తూ ఒక చుక్క కనిపిస్తుంది. దాన్ని చుక్క అనరు. గ్రహ మంటారు. ఆ లోకంలో కొంటెపిల్ల లీతలాడేందుకు చాలాచాలా నదు లున్నాయి. ఆ నదు లెంత వెడల్పుంటాయో తెలుసా! వర్షాకాలంలో మన కృష్ణానది ఉండే వెడల్పుకన్నా 50 రెట్లు వెడల్పు ఉంటుంది ఒక్కొక్కనది. వాటిముందర మన నదు లెంత! అయితే అక్కడకూడా చిన్న చిన్న నదులు లేకపోలేదు. ఆ నదులకు రెండు ప్రక్కలా ఆలోకంలోని పిల్లలు ఆడుకునేందుకు చెట్లు, చేమలు చాలా ఉన్నాయి. ఆ లోకంలో పిల్లలు వేసవికాలం వస్తేనేగాని నదుల్లో చెరువుల్లో ఈతలాడటానికి రారు. వాళ్లకు చలి యెక్కువ. సంక్రాంతి రోజుల్లో తెల్లవారుఝామున మన మెంత వణికిపోతుంటామో వాళ్లు వైశాఖమాసంలో (వేసవి కాలంలో) గూడా అంత వణుకుతుంటారు.

మనకన్న వాళ్లకు సూర్యు డెక్కువ దూరంలో ఉన్నాడు. ఉన్నాడు. వాళ్ల యిళ్లల్లో ఎప్పుడూ ఆవిరిపోతూన్న గొట్టాలు పొడుగైనవి పెట్టుకోవాలి. వాళ్ల యిళ్లన్ని పైన మంచుపడి ప్రూడిపోతాయి కాబట్టి మన భూలోకంలోకూడా రష్యాదేశంలో ఇలాగే ఉంటుంది. సైబీరియామంచుఎడారిలో చలి చాలా ఎక్కువ. అక్కడ ఇళ్లు కట్టుకొనేవాళ్లు ఎన్నో అంతస్థుల యిళ్లు కట్టుకుని, పై అంతస్థుల్లో ఆవిరిగొట్టాలు పెట్టుకొని నివసిస్తారు. ఎప్పుడూ బాగా మందంగా ఉన్న ఉన్నికోట్లు తొడుక్కుంటారు. ఎదురింటి అబ్బాయిమాదిరి బట్ట విప్పేసుకుని తిరిగితే మంచుకు కొయ్యబారిపోతారు. శీతాకాలంలో రష్యాదేశంలో వీధులన్నీ వెచ్చగా ఉండేందుకు వాళ్లు ఆవిరిపారే గొట్టాలతో వీధులను నింపుతారు. అట్లాగే కుజలోకంలో వీధులుగూడా వాళ్లు నానాయాతనలో పడి వెచ్చగా ఉంచుకోవాలి. వాళ్లెంతగా అవస్థలు పడుతున్నా వాళ్ల యింటి వాకిళ్లలోను, దర్వాజాల సందుల్లోను మంచుగడ్డలు పేరుకుపోయే ఉంటాయి. అయితే వేసవికాలంలో వాళ్లకి ఫర్వాలేదు. మామూలుకోట్లు తొడుక్కొని, దట్టమైన టోపీలు పెట్టుకొని తాకుటీకు మని వీధుల్లో తిరగవచ్చు. శీతకాలంలో మాత్రం తలుపులన్నీ బిడాయించుకొని పైఅంతస్థుల్లో నిప్పు సెగప్రక్కన కూర్చోవాలిసిందే. అందుకని దేవుడు వాళ్లను కరుణించి వాళ్లమీద వెచ్చటి గాలులు పంపిస్తుంటాడు. వాళ్ల గాలిలో నీటి ఆవిరి నూటికి పదిపాళ్లే ఉంటోంది. అందుకని వాళ్లకి పైనుంచి పడే మంచుగూడా చాలా తక్కువే.

కుజలోకంలో చాలామంది పిల్లలకు వానలంటే యేమిటో గూడా తెలియదు.

ఆలోకంలో అసలు వానలే ఉండవు. అందుకని ఆ పిల్లలు వానలు చూడాలన్నా, వడగళ్లు తినాలన్నా, వాననీళ్లు కాలువలుగా పారుతుంటే కాగితపు పడవలు వేసి వాటితో ఆడుకోవాలన్నా, ఆ లోకంలోంచి మన భూమిమీదకు రావాలిసిందే! ఇంకా వాళ్లలోకంలోని మట్టికూడా మన మట్టికన్నా చాలా తేలిక. ఇక్కడ బుట్టెడు మట్టిని మోసేవాళ్లు అక్కడ తట్టెడు మట్టిని మోయగలుగుతారు. ఆ లోకంపిల్లలకు పర్వతమంటే ఏమిటో తెలియదు గూడా! ఆలోకం మొత్తంమీద ఎక్కడచూచినా పర్వత మనేదే కనిపించదు. అంతా సాఫీగా చదునుగా ఉంటుంది. అక్కడక్కడ చిన్న మట్టిగుట్టలు కనిపిస్తాయేమో! హిమాలయాల వంటి యెత్తైన పర్వతాలను చూడాలంటే వాళ్లు భూమిమీదకు రావాలిసిందే! "నాకు పర్వతం చూపెంచవూ, నాకు వానంటే యెట్లా వుంటుందో చెప్పవూ" అని అక్కడి పిల్లవాడు మన భూలోకంలో పిల్లవాడి నడగాలిసిందే!

మరి కుజలోకంలో పర్వతాలు లేవుగదా నదు లెట్లా పుట్టా యంటావేమో! అక్కడ నదులన్నీ అవి పుట్టినవి కాదు. అక్కడి వాళ్లు స్వయంగా త్రవ్వుకున్న మహానదు లవి. మన భూమికి ఉత్తరధృవము, దక్షిణధృవ మున్నట్లే ఆలోకానికి కూడా ధృవా లున్నాయి. మన ధృవాలదగ్గర మంచున్నట్లే కుజలోకంలో ధృవాలదగ్గర కూడా మంచు గడ్డలు పేరుకుపోయి ఉన్నాయి. శీతాకాలంలో కుజలోకంలో ధృవాలదగ్గర మంచు అలకపుమధ్య రేఖ వైపుకు పారుతుంది. ఆ వ్యాపించటంలో

(36 వ పేజీ చూడుడు)

# రుద్రమదేవి

(12-వ పేజీరుతవాయి)

సద్దుకొనిరి. కొందరు స్వస్థానములు వదలలేక అచ్చటనే నిలిచి స్వర్ణకారాదివృత్తులలో స్థిరపడసాగిరి.

అట్లు నిలిచిపోయినవారికి పలువురకు చిరకాలము వ్రాయసవృత్తిలో చేతులు మెలగినందున క్రొత్తవియగు స్వర్ణదారుశైలాదులలో నంత నిపుణముగా వారి హస్తములు ప్రసరింపకుండెను. వ్రాయసవృత్తిలో నున్నపుడు సంపాదనము తక్కువైనను సంఘములో నొక గౌరవ మెక్కువ యుండెను. ఆ గౌరవ మిప్పుడు వారికి పోయినది. తమకంటె తక్కువవారని ఇన్నాళ్లు తలచిన వారితో సమానముగానైన ఇప్పుడు ఆ కర్మలలో నైపుణి వీరికి కుదురలేదు. అట్టి సామాన్యకరణములకు తమ వ్రాయసవృత్తితోపాటు జీవనాధారమే పోయినట్లయినది. వారికి ఆంధ్రరాజుమీదను వారి మంత్రిసామంతదండనాథులమీదను అంతరంగములలో తీవ్రమైన కోపము చెలరేగినది. కాని యేమి చేయగలరు? అట్టివారికి నాగాచారివంటి ప్రధానకరణములు ప్రభువుపై ద్వేషము వృద్ధియగునట్లు ప్రేరేపుచుండిరి. అమాయకులగు నట్టి పేదలు ఉద్రేకపూరితులై సమయము చిక్కినప్పుడు అకార్యములు చేయసాగిరి. వారిలో పట్టుబడినవారికి రాజపురుషులు శిక్షలు విధించుచుండిరి. అట్లు వారు పొందు శిక్ష లతిశయించుచున్నకొలదియు వారికి ప్రభుత్వముపై ద్వేష మభివృద్ధి నొందసాగినది. అందుపై నల్లరులు పెరిగినవి. శిక్షలు పొందినవారు తాము చేసిన దోషములు తలపోయుట మాని, రాజపురుషులు విధించు శిక్షలే భావించుచు, వారికి పక్షపాత మారోపింపసాగిరి. మున్నెన్నడు లేనిది కాకతీయప్రభువులకు జైనులపై ద్వేషము జనించినదని యొక ప్రథ వారు ప్రవర్తింపజేసిరి. వినాశకాలే విపరీతబుద్ధిః!

ఇట్లు పురుషులే కాక స్త్రీలుకూడ ప్రభువులను ఆడిపోయసాగిరి. అట్టి యపప్రథ యొకసారి లోకములో ప్రవర్తమానమైనచో దాని నెవ్వ రాపగలరు. దొరలించిన చక్రమువలెనే అదియు సాగిపోయెను. చౌర్యము చేసినవారికి కరచ్ఛేదనము సామాన్యశిక్ష! ఆ శిక్ష పొందినది ఒరుడైనచో నెవ్వరు నేమియు ననుకొనరు. కాని అది జైనచోరునికే తటస్థించిన వారిలోవారు 'మరల వీని నొకనిని గూడ శిక్షించుచున్నారు. మన కిక తలలు నిలువవు. పాపమిత డెంత మంచివాడు! ఇట్టివాని నా రాజపురుషులు శిక్షించుట? వినాశకాలే విపరీతబుద్ధిః! ఇట్లని యనుకొందురు. అట్టి మాటలు వినిన జైనేతరులు గూడ, 'కాబోలు పాప'మని జాలి నొందుదురు. ఇట్టి యపప్రథలు నాగాచారి సర్వవిధముల పట్టణమున పొక్కునట్లు చేయుచుండెను.

కాని యీ వ్రాయసకాండ్ర రోషమంతయు ముఖ్యముగా బ్రాహ్మణకరణపాఠశాలలపై కేంద్రీకరించెను. "ఇది మహాప్రమాదము! వీరికి అబద్ధమగు వేదమును గంగిరెద్దువలె తల లాడించుచు అప్పగించుట మాత్రమే వచ్చును. ఎంతవారితోనైనను వారికంటె తామే అధికుల మైనట్లు ప్రవర్తింతురు. దౌర్భాగ్యవశమున నట్టి మూఢులకే ఈ రాజ్యమున విశేషగౌరవము కలదు. వీ రేమి వ్రాయగలరు? వ్రాసినను అందముగా వ్రాయుట ఎన్ని జన్మముల నభ్యసించిన వీరికి రాగలదు? ఈ ఛాందసులకు లెక్క లేమి యవగతము కాగలవు? రాజ్యతంత్రము వీ రేమెరుగుదురు? దీని ఫలము ప్రభువులు త్వరలోనే తెలిసికొందురు. అప్పుడు వారే మనతో కాళ్ల బేరమునకు వత్తురు. తొందర ఏమి?—"

ఇట్లు వారిలో వారనుకొనుచుందురు. ఒక వంక 'తొందర యేమి?' యనుచునే యుందురు. మరియొకప్రక్కను వారి చిత్తములు అలజడిచెందుచునేయుండును; వారి మనస్సులలోని తొందర స్పష్టముగా వారి దేహములలో నాపాదమస్తకము ప్రతిబింబించుచునే యుండును. ప్రభువులను, బ్రాహ్మణకరణములను నోరార తిట్టుదురు. తిట్టుచున్నకొలదియు వారికి వారిపై ద్వేష మతిశయించును.

కరణపాఠశాలలలో చేరిన బ్రాహ్మణులు వారికి వీధిలో కనబడినచో వారిని ఏదోవిధముగా వారు పరిహాసము చేయుదురు. వారికి వినిపించునట్లు తమలోతాము తిట్టుదురు. వారు పెట్టుకొనిన బిళ్లగోచీలనో శిరస్సులపై ప్రకాశించు శిఖలనో పైనుత్తరీయపు చెంగులనో ఎరుగనట్లే యుండి లాగుదురు. వారు వెనుకకు తిరిగి చూచుకొను లోపున దూరమై కిలకిల నవ్వుదురు. ఒంటరిగా వారు దొరికినయెడల నట్టివారిని అటునిటు చూచి ప్రహరించి సందుగొందులలో దూరి పారిపోవుదురు. అందుచే ఈ క్రొత్తగా లెక్కలు నేర్చుకొనువారు ఒంటరిగా చీకటివేళల నగరవీథుల సంచరించుటయే ప్రమాదభూయిష్ఠ మయ్యెను.

వారు చెప్పుకొను పాఠములు ప్రారంభించుట సామాన్యముగా మధ్యాహ్నమునుండియే. ప్రతిదినమును పాకనాటికరణములందరు నా పాఠశాలలకు వచ్చుచుండుటకు వారికి తీరుబడి లేదు. అందుచే కొందరే వచ్చుచుందురు. ఆ పాఠశాలలును ఒక్కచో లేవు. స్వయంభూదేవాలయావరణమునను, ఏకవీరాదేవి, చముండేశ్వరీశక్తి, భైరవస్వామి, ముసానమ్మ, కొమరుసామి, పాండవుల గుడి, వీరభద్రేశ్వరుడు, మాహురమ్మ, కామవల్లి, మహాలక్ష్మి, కాకితమ్మ'— ఇత్యాదిదేవతల యాతనములందును, కొన్ని కరణపాఠశాలలు పెట్టిరి. మరికొన్ని పెద్ద 'ధర్మసత్రముల మధ్యభాగమున గల మండువాల చుట్టును సాగుచున్నవి. అయినను అవి చాలవు. ఆరువేలమంది చదువుచుండిరాయె! కొన్ని కొన్ని పాఠశాలలు నగరములో మధ్యమధ్య గల విశాలప్రదేశములలో తాత్కాలికములగు, వెదురు తాటియాకు కొబ్బరియాకు రెల్లు అడవియాకు మొదలగు పరికరములతో నిర్మింపబడినవి. వాని కెల్లప్పుడును అవసరమగుచు వచ్చిన తడకలు సిద్ధముచేయుచు మేదరవాడ రాత్రింబవళ్లు పనిచేయుచు తీరిక లేకుండెను.

ఇట్లు తాత్కాలికములగు సాధనములతో నిర్మింపబడిన పాఠశాలలు ఉద్యోగములు పోయిన చిల్లరకరణములకు కన్నులు కట్టించుచుండెను. ఈ రాత్రి బ్రాహ్మణవాడలో నట్టి పాఠశాల యొకటి పరశురామప్రీతి యగును. ఇంకొకటి రేపు అక్కలవాడలో కూలిపోవును. మరునా డింకొకయెడ గల పాఠశాలకప్పు తెల్లవారు నప్పటికి కనబడదు. ఇట్టు పరిపరివిధముల నా పాఠశాలలు సాగకుండ విఘ్నము లొనర్చుట కా దుండగులు ప్రయత్నించుచుండిరి.

అయినను రాజానుగ్రహమును ప్రధానుల యభిమానమును ఉన్నందున ఆ పాఠశాలలో విద్యాబోధనమున కట్టి దీర్ఘనిరోధమును కలుగకుండ అవి సాగిపోవుచుండెను. దహనమైన పాఠశాలకంటె

బలిష్ఠ మగు భవనము మరునాటికే అక్కడ సిద్ధమగును. కూలిపోయినది నిలువబడును; తడకలు పోయినదానికి ఆచ్ఛాదనము మరల సరియగును. పైపెచ్చు రాత్రిందివమును వానిని రక్షించుచుండుటకు భటులు నియమింపబడిరి. వారును ఆ శాలలపై దుర్మార్గుల యీగ వ్రాలినను కఠినముగా పట్టి దండింపసాగిరి.

ఈ పాకశాలల కన్నిటికి మూలకారణుడు అన్నమంత్రి. అన్నమంత్రిపై ముఖ్యముగా వారి ద్వేషము లగ్న మగుటలో ఆశ్చర్యము లేదు. అందును అతనిపై ప్రత్యేకము ద్వేష మూనిన నాగాచారి నిజముగా నాగావతారమే, ఆశీవిషమే, పన్నగమే, కర్కోటక స్వరూపమే, ద్విజహ్వాకారమే! అతడు దీర్ఘక్రోధుడు. అతడూహించిన విధమున తన్ను అన్నమంత్రి యవమానించినపిమ్మట వారముదినములైన తిరుగకముందే ఆ మంత్రి రాజమందిరములో బంధితుడయ్యెను. ఇంకను ఆ శిక్ష చాలదు. అతని నిర్బంధము ఎంత చిత్రముగా నున్నది! అతని కన్ని మర్యాదలును జరుగుచున్నవి. అయినను అతడు నగరమునందు నాయంతటివాడు లేడని రొమ్మువిరుచుకొని యిప్పుడు తిరుగాడుట లేదు. రాచనగరు వదలి బయటకు వచ్చుటలేదు. తన యింటికైనను వచ్చి చూచిపోవుట లేదు. అతని భార్య సిద్ధమగాని తల్లి గౌరీదేవిగాని ముద్దుకూతురగు బాలాంబగాని యాతని చూడబోవుట లేదు. ఛాందసు లగు నలుపురు బ్రాహ్మణులుమాత్రము రాకపోకలు సలుపుచున్నారు. ఇప్పుడన్నమంత్రికూడ వారితోపాటు గంగిగెద్దువలె తల యూడించుట అభ్యసించుచున్నాడందురు. అది కారాగారమున నుంచుట కాదా? కాకున్న నాతనిపై నభిమానముచే నతనికి తగినట్లు శృంఖలములు తగిలింపలేదు; తల తరుగలేదు. బంగారుపంజరములో చిక్కుకొని నట్లయినాడు. మహారాజుల దక్షిణభుజమ నని విర్రవీగిన యాతడు నేడు రాజద్రోహిగనే పరిగణింపబడుచున్నాడు!

కాని యీ ప్రభువుల బుద్ధు లర్థము కావు. చాంచల్యము, పక్షపాతము, దురభిమానము, ఆశ్రితవాత్సల్యము వారిని నానా మార్గముల లాగుచుండును. అన్నమంత్రి రాజద్రోహి యైనచో ఆ తిక్కన ఏల కాడు? అతనివెంట వచ్చిన యా పాకనాటికరణములు నూర్వురు నేల కారు? ఆ తిక్కన చెవులకు తగిలించుకొన్న కుండలములు, ముఖమున ప్రకటించు దౌర్గ మార్గ్యమును, ఆ కరణములు మాటిమాటికి చేయు స్వస్తివాచనమంత్రములును ప్రభువులను దిగ్భ్రాంతుల గావించినవి. అన్నమంత్రికి వారి కాశ్రయ మిచ్చినందుకే శిక్షయు. ఆ యాతని యాశ్రితులకే ఈ ఆదరాభిమానములును, నూటిగా నాలోచింపగల వారెవ్వరు? ఒక్కటైనను కర్త మగునా?

ఈ విధముగా నాగాచారియు నతని మిత్రులును సహచరులును ఆలోచించుకొనుచుందురు. కాని వారి యాలోచన తెగదు. తిక్కనపై ద్వేషము పెరుగును. అది వారివెంట నున్న చిల్లరకరణములకు ప్రాకును. ఏమి యా ధైర్యము ఈ తిక్కనకు! మహారాజుల యభయహస్తమే తన్నెల్లప్పుడు రక్షింప గలదని కాబోలు నాతని యతిశయము!

తిక్కనసోమయాజియు తనవెంట గురునాథుడును మారనయు ననసరింపగా అన్నమంత్రిగృహమునుండి కేశవ శ్రీస్వయంభూదేవాలయములయొద్దకు నిస్తంద్రులై నడచిపోవుచుండుట అనుదినము చూడచూడ వారిలో కొందర కంతకంతకు భరింపరాని దయ్యెను.

ఒకనాటి సాయంకాలమున సోమయాజి యానాటి శ్రీమహాభారతరచనము ముగించుకొని స్వయంభూసరోవరములో వార్ని



నేపాల్ ప్రధాని మహారాజా మోహన్ షంషేర్ జంగ్ బహదూర్ రాణా ఫిబ్రవరి 19-వ తేదీన రాజఘాట్‌కు వెళ్లి గాంధీజీ సమాధికి పుష్పాంజలి సమర్పించారు.

దేవదర్శనము కావించుకొని తిరిగి యింటికి వచ్చుచుండెను. యథాప్రకారము మారనగురునాథులు మాత్ర మాయనవెంట నుండిరి. పైకరణములచే ప్రేరేపింపబడిన కొందరు కర్ణాటకులు మదిరాపానమత్తులై వారి కెదురు వచ్చుచుండిరి. ఆ త్రిమూర్తులకును ఉన్న రాజానుగ్రహము నాగరకు లెల్లరు నెరిగియున్నందున నందరును, పెద్దలుగాని పిన్నలుగాని, ఎట్టివా రైనను ఎదురైనయెడ గౌరవముతో వారికి దారివిడిచి ప్రక్కకు తొలగుచుండుట పరిపాటియైనది. ఆనాడు తిక్కనసోమయాజియు మిక్కిలి చింతాపరుడై యడుగులు వేయుచుండెను.

'అన్నమంత్రీశ్వరున కీ నిర్బంధ మేమి? నా కీవిశేషగౌరవ మేమి? ఈ నగరమున నెందు బోవుట కైనను సర్వస్వాతంత్ర్యము నాకు మహారాజులు దయచేసినారు. కాని నా కెం దేగవలసిన యవసర మున్నది? నా త్రేతాగ్నిశాలయు కేశవశ్రీస్వయంభూనికేతనములును గాక వే రెందు బోవ పని యున్నది! అన్నమంత్రిని గూడ నేను చూచిరావచ్చును. కాని చూచి ఏమి చేయుదును? సామ్రాజ్యపట్టాభిషిక్తు డగు మహారాజుచే శిక్షితుడైన యన్నమంత్రీశ్వరుల నైనను మాబోంట్లము దర్శింపవచ్చునా? దోషము కాదా? అతడు నిర్దోషియే అట్లు నిర్దోషి యని మరల మహారాజులచే నిశ్చితమగువరకు నట్టివానిని మాబోంట్లము చూడరాదు! ఎంత కష్టమగు వ్రతము! అదియును గాక అన్నమంత్రిని నేను చూచి వచ్చుచుండుట యుక్తమును గాదు. మహారాజుల యాజ్ఞలు చిత్రములై యగమ్యగోచరములుగా నుండును. నే నీ యనుమతి నాధారము చేసికొని అన్నమంత్రియొద్దకు రాకపోకలు సల్పుచుందునేమో పరీక్షించుటకుగూడ నిట్టి సర్వస్వాతంత్ర్యము మహారాజులు నా కిచ్చియుండవచ్చును.—'

ఈవిధముగా సోమయాజి చింతించుచుండును. కాళ్లు మాత్రము సుపరిచిత మగు రాజమార్గమున సాగిపోవుచుండెను. కృష్ణపక్షము! చీకటిగా నున్నది. ప్రక్క నున్న మందిరములనుండి దీపముల వెలుగు రాజమార్గమును మధ్యమధ్య కనులుకనులుగా పడుచు భాసింపజేయుచుండెను.

వా రప్పు డొక చీకటికునిలోనికి చొచ్చియుందురు. సోమయాజి యాలోచనలో నుండి బాహ్యప్రపంచ మెరుగకుండెను. అకస్మికముగా తన చుట్టును గందరగోళముగా పెద్దధ్వని యగుచున్నట్లు తోచి నిద్రనుండి మేల్కాంచినట్లు సోమయాజి చుట్టును పరికించెను.

ముందు త్రాగి వచ్చుచున్న కర్ణాటకులు పలువురు సోమయాజులను కొట్టుటకై అన్నిదిక్కులనుండి మూగుచు కేకలు వేయుచు చేతులు కర్రలు నెత్తుచుండిరి. ఆయనపై గురి చూచిన దెబ్బలన్నిటికి మారన తన దేహ మడ్డుపెట్టి కాచుచుండెను. గురునాథుడు సింహమువలె ఆ గుంపులోనికి జొరబడి చేతి కందిన వెల్ల త్రిమ్మచు త్రోయుచు బాదుచు వారిపై విజృంభించుచుండెను. గురునాథు డెటు పోయిన నావైపునుండి యా త్రాగుబోతుల మూక తొలగి పారుచుండెను. భీమసేనుడు తేరు దిగివచ్చి కౌరవసేనలు చెల్లాచెదరు చేయుటకు తాను వర్ణించిన దీనాడు గురునాథుడు తన చర్యతో ప్రత్యక్షు మొనర్చుచుండెను. గురునాథుడు త్రోయు త్రోపులకు ఒక్కొక్కసారి నలుగురు, ఐదుగురు, పదిమంది కట్టలు కట్టలుగా వెనుకకు ఒకరిపై నొకరు పడి నేల కరచుచుండిరి. ఆ గుంపులోని వారు గురునాథుని తాకులు తప్పుకొనుచు ఎట్లో సుకుమారు డగు మారనపైకిని వృద్ధు డగు సోమయాజిపైకిని కవియ ప్రయత్నించుచుండిరి. వారు కొట్టుచున్న దెబ్బలతో మారనదేహ మంతయు కమలిపోయెను. అత డెంతసేపటికిని తిక్కనసోమయాజిపై దెబ్బలు పడకుండ కాచుకొనుటయేగాని తన్ను రక్షించుకొనుటకుగాని యా త్రాగుబోతులను శిక్షించుటకుగాని యత్నింపలేదు. సోమయాజి నిస్తంద్రుడై నిలుచుండెను.

అంతలో గురునాథు డది చూచి మహోగ్రు డయ్యెను. మారన సోమయాజుల నిక రక్షింపజాల డని స్పష్ట మయ్యెను. ఆ గుంపులో నొకరియొద్దనుండి యొక దండమును గురునాథుడు బలవంతముగా లాగికొని అది మిక్కిలి చాకచక్యముతో త్రిప్పుచు సోమయాజుల చుట్టు ప్రదక్షిణము చేయసాగెను. ఆ దండ మాతని చేతిలో కాలదండమువలెనే భయంకరమై తాండవింపసాగెను. ఆ యాటోపమునకు ఆ కర్ణాటకుల గుంపు తాళలేక చెదరిపోజొచ్చెను.

సరిగా ఆసమయమున నొక్కసారిగా అన్నిదిక్కులనుండి శంఖారవములు మారుమ్రోగినవి. నూరుగురు వీరభద్రులతో గండడాగుంపును చుట్టుముట్టెను. వీరభద్రులను చూచినంతనే పారిపోవ దారిలేక ఆ కర్ణాటకులు నిలువున నిలువబడిపోయిరి. త్రావిన మత్తు ఒక్కసారిగా వీరభద్రులు ప్రయోగించిన కశాఘాతములతో వారికి వదలిపోయినది!

రౌద్రమూర్తియై ఇంకను కర్ర త్రిప్పుచునే యున్న గురునాథునకు గండడు వినీతుడై మ్రొక్కి శాంతింపు డని ప్రార్థించెను. అప్పటికిగాని రాజభటులు వచ్చినా రని గురునాథునకు తెలియలేదు. అప్పుడు గోజాచు త్రిప్పుచున్న కర్ర యాపి యాతడు నిలువబడెను. గండ డామువ్వురను పరామర్శించి ఆ కర్ణాటకుల గుంపులో నున్న నలుపదిమందిలో నొక్కరినిగూడ తప్పించుకొనిపోనీయక పాశములతో దృఢముగా బంధింప జేసి చెరసాలకు తీసికొనిపోయెను.

గురునాథుని కైదండసహాయముతో మారన ఎట్లో ఇల్లుచేరెను. తిక్కన సోమయాజి మారనపై కరుణార్ద్ర మగు దృక్కులు బరపుచు నతని దెబ్బలు తన యమృతహస్తముతో నిమురుచు తోడనడచెను.

ఇంటికి చేరగనే మారన నిలువలేక తూలి పడిపోయెను. అన్నమంత్రియింటిలోనివా రందరును మారనచుట్టు మూగి గురునాథునివలన జరిగిన వృత్తాంతమంతయు దెలిసికొనిరి. అందరును మారనకు సమస్తవిధము లగు నుపచారములు చేయసాగిరి.

కాలమున కెంత వైపరీత్యము వచ్చినది! రాజధానీనగరవీధులలో, అన్నమంత్రీశ్వరునికి పూజ్యు లగు నతిథులను త్రాగుబోతులు చుట్టుముట్టి కొట్ట సాహసించుటా!

అన్నమంత్రీశ్వరుని కుమార్తె బాలాంబ మారనను ఆ స్థితిలో చూచినంతనే బావురు మని యేడ్చుచు నతనియొద్దనే నిలిచిపోయెను. మారనకు శీఘ్రముగనే స్మృతి వచ్చినది. ఎంత చెప్పినను ఆ రాత్రి బాల అన్నము నీరు ముట్టలేదు. నిద్దురపోలేదు. మారనయున్న చోటినుండి ఈవలకు రాలేదు. మారనబాధకంటె ఆ అరేళ్లపిల్ల యావేదన చూచినవారికి కడుపు తరుగుకొనిపోవునట్లుగా చేసెను. అది మాటిమాటికి 'తాతగారూ, తాతగారూ,—' అని సోమయాజిని పిలుచుచు ఆ సాయంత్రము జరిగిన వృత్తాంత మడుగును. విసుగులేకుండ గురునాథు డాదరముతో నది యడిగినదాని కెల్ల ప్రత్యుత్తర మొసగుచుండెను.

'మా నాన్నగారు చూచిన ఆ నీచులను ప్రాణములతో పోనిచ్చెడివారా!—తాతగారూ, నాన్నగారు ఎక్కడ నున్నారు?' బాల యట్లు ప్రశ్నింపగా గురునాథుని కన్నుల నీరు గారెను. సోమయాజుల కన్నులు ఆర్ద్రములై మొగ మావలకు త్రిప్పుకొనెను.

## శికాగతి

(10 పేజీ తరువాయి)

ప్రహరించెన్ని జనేత్రయుగ్మములన
బ్బా! రక్తరూపంబులై!
దహియించున్ తనువెల్లకంఠమును ని
ర్ధారించి రక్షించిపం
గ్రహామున్ జేయును నాదు యాతనను శీ
ఘ్రంబోగురూత్తంసమా!

—3 వ, రంగం—

(కళాకోవిదుడు ధూర్తమతిని క్షమించడు. వానివిన్నపం త్రోసిపుచ్చి ఆశ్రమానికి తిరిగి పోయాడు. సౌదామని అతనివెంటబడి ప్రార్థిస్తుంది.)

సౌదామని:
నాప్రియుండటంట వంధుడై నవయుచుంట
నరసి యెట్లోర్తు తండ్రి నాయార్తికొంత
అవధరింపుము వానిపై నలుకమాని
చక్షుల నొసంగి నాప్రాణరక్ష సేయు

కళా:అమలశీతాంబుపూరకాసారమట్లు
పరగుచుండిన యాశ్రమవాటి నెల్ల
కలతపెట్టిన యున్మత్తగజము వాడు
క్షమ కనర్హుడు కూతుర సాగిపొమ్మ

సౌదామిని:
నాకెందుకు బ్రతుకిక నాన్నా
నాప్రియుడే లేకేయున్న!
ఓ మహోజ్వలచంద్రికారామణీయ
విలసితాద్భుతరాత్రీ!నవీనరాగ
రాజితోన్మేషకుసుమహార్మ్యాంతరస్థ
మధురమధుపాయి భ్రమరి! చంపాప్రసూన
సురభిలామందమారుతచూతశాఖి
కాంతరస్థవినీలవిహంగి! ఇపుడె
ఋణము తెగ మీకు నాకును—
(అంతలో ఆమెతండ్రి చురచురమాస్తూ లోనికి వెళ్లిపోతాడు)

సౌదామిని:
అయ్యో నీకంతటికోపం
అతనిపై నిపుడెందుకు నాన్నా
కోపం చాలింపుము తండ్రీ
శాపం మరలింపుము తండ్రీ

కళా: వినునువినను నీమాటలు వానికి
వేసినదే యొకచిన్న శిక్ష—
పొమ్మపొమ్మ నన్నతిబ్రతిమాలకు
పొద్దుపొడుపు సమయమ్మయెను

సౌదా:ఎవనివల పీతనూలత కిన్నినాళ్లు
ప్రాణమో ఎవనిపాదద్వయాన నాదు
వలపు వయసును గృమ్మరింపగ దలంచి
యుంటినో వాడు నను గననోపడేని
అందమేటికి వయసేల యసువు లేల!!
ఓ యనంతవిభావరీ! ఓహోమహోగ్ర
దురతసంఘట్టనాజీర్జితోరుగర్భ!!
ఓ విభావరి! సొగసునిరోమ్మక మట్లు
లాగివైవుము నా శరీరంబునుండి
గురువులన్ దండ్రులను తిరస్కరణ చేసి
నట్టి పురుషుల కంథకారాప్తి నిజము
స్త్రీకి హృది భగ్నమే తథ్యశిక్ష జుమ్మ

---

## మన ముక్కుగతి ఏమౌతుంది?

(13-వ పేజీ తరువాయి)

మీటర్లు, ఇంకా దుర్వాసన పసిగట్టే స్టింకో మీటర్లు ఉన్నమాట నిజమే. ఒప్పుకున్నాం. కాని అవెక్కడ! గాలిలో ఆవిరిరూపంలో ఏదైనా వస్తువు లేచివచ్చి కంటికి కనిపించేట్టయితేనే ఈ యంత్రాలు వాసన పట్టగలవు. అంతే. కెమేరా ఉందంటే కన్ను చేసినంతపనీ చెయ్యగలదు. ఫోనోగ్రాఫ్ ఉందంటే అది విననూగలదు; విన్నదాన్ని అక్షరరూపంలో వ్రాసిపెట్టనూ గలదు. కాని అత్తరేదో, మిరపకాయగొడ్డేదో విడమర్చి చెప్పడానికి యంత్రంలేదు. చచ్చినట్టు ముక్కుతో ఎగపీల్చవలసిందే.

డా॥ వాన్ మైజెస్ ఒక జోస్యంకూడా చెప్పారుట. (ఈ వార్తకూడా సత్యమునే అనుకుందాం) కొన్నితరాలు గడిచిపోయే సరికి మనుష్యుల ఘ్రాణశక్తి క్రమంగా క్షీణించిపోతుందన్నారుట. మా ఉద్దేశం ఏమిటంటే డాక్టరుగారు చెప్పినమాటకి అతివ్యాప్తిదోషం కొట్టిందని. మన ఘ్రాణశక్తి క్షీణించి అంతరించిపోతుందంటే ఒప్పుకోం. జీవపరిణామం మరీ అంత తెగబడి పరుగెత్తదు. అసలు ఇప్పటి మన ఘ్రాణశక్తి ఇంతకి రావడానికి కొన్నికోట్ల సంవత్సరాలు పట్టింది. తరాలు గడిస్తే చాలదు, లక్షలు కోట్ల సంవత్సరాలింకా గడిచిపోవాలి. అప్పుడుగాని మనకి రాత్రివేళ మల్లిపూలవాసనకూడా ఆనందించలేని దుస్థితి సంభవించదు.

వాసనశక్తి తగ్గిపోతే నిజంగా మన రుచీ రసం ఏమౌతాయో! తినేవీ తాగేవీ వాసన చూడలేకపోతే నాలుకకి రుచి చచ్చిపోతుందని మా ఉద్దేశం. (మా ఊహకి తగిన గట్టి కారణా లున్నాయి లెండి.) వాసనతో పాటు రుచికూడా చచ్చిపోయినప్పుడు ఇంక "భలే మసాలా" అంటూ రొట్టలు వెయ్యడం ఇంక ఉండదు.

[న్యూయార్కు టైమ్సునుంచి]

---

# నరకంలో స్వర్గం

(16-వ పేజీ తరువాయి)

అదిగో కోడలుంది. చెప్పమ్మా. నీ మీదే ఆశ పెట్టుకొని యాత్ర సాగించేస్తాను. ఆ కాశీ విశ్వనాథుడు, యీ యేడుకొండల వాడు మళ్లీ నింపాదిగా యీ ప్రాణిని యిక్కడకు చేరిస్తే, ఆ దేవుడిపేరూ, నీ పేరూ చెప్పుకుంటాను.

ఈ చివరిమాటలు సుందరమ్మకు విస్మయాన్ని కలిగించాయ్. వెంకమ్మమీద మొదటినుంచీ వున్న అభిమానం, భక్తి కట్టలు తెంచుకొని ప్రవహించింది. వెంకమ్మ యాత్రకు బయలుదేరుతూ కోడల్ని పిలిచి కూర్చోబెట్టి నిమ్మళంగా "సుందరమ్మని జాగ్రత్తగా చూడం"డంది. ప్లీడరుగారి భార్యకు సాధారణంగా 'లా' పాయింట్లు తృణంగా తెలుస్తాయ్. భౌతికదృష్టితో వున్న ఆ 'లా' పాయింటుతోనే "దానికేం లోటు? ఏదో పనిపాట్లుచేస్తుంది. తింటుంది. ఉంటుంది. యేం భయపడకండి."

"అంతేనా కోడలా? తినటం, వుండటమేనా చెప్పావ్? అభిమానం, మంచీ, మర్యాదలూ వుంటాయ్. యెప్పుడూ పట్నం ముఖం యెరగని పిల్ల. పైవాళ్ళయింటికి వెళ్లిన పాపాన పోలేదు. వెంట త్రిప్పుకోవాలి. నేర్పాలి. మీ అందరికీ తిండిదగ్గరికి వస్తే కోపా లూడిపడ్తాయిగా"

"యేదో మేం పడ్తాం లెండి. మీరు కులాసాగా వెళ్లిరండి. అంతకీ కాదంటే వంట బ్రాహ్మణ్ణి పెట్టాం."

యీ మాటలకు వెంకమ్మ నొచ్చుకుంది. సద్భావంతో వీళ్ళంతా సుఖపడతారని, తల్లి, తండ్రీ, మొగుడూ ముగ్గుర్లో యెవరూ లేని దిక్కులేనిపిల్లవి, సేవకు ప్రతిఫలంగా కడుపునిండా తింటుందని తెస్తే - చివరికి ఆమె ఆరాటం అంతా చీపురుపుల్ల చివరవిరిచి పడేసినంత తేలిగ్గా కోడలు మాట్లాడింది! దేవుడున్నాడని నమ్మే వాళ్ళకి దేవునిపుట్టుపూర్వోత్తరాలు, ప్రస్తుత జీవితం అక్ఖర్లేదు. వాళ్లు బాధపడే టప్పుడు యేదో ఒక రూపు, లేక ఒక పేరు పెట్టుకొని స్మరించటంతో బాధ నయంచేసుకుంటారు.

ఏడుకొండలవాడిని స్మరించుకుంటూనే వెంకమ్మ గుమ్మందాటింది. తోడూ నీడా లేని అనాథపక్షిలా సుందరమ్మ అటుమటించిపోయింది.

దినదినానికీ ఆమెలో తెలుసుకోలేని ఆరాటంమండిపోతోంది. అయినా అప్పుడప్పుడూ ఆయింటివాళ్ళవిషయం ఆలోచించకుండా వుండలేకపోయేది. వెంకమ్మ రైలుస్టేషనుకు వచ్చిన త్రోవలో మనుమడు, మనుమరాలివిషయం చాలా తక్కువ చెప్పింది. కృష్ణారావు, పద్మ అన్న చెల్లెల్లా సరిగ్గా ఆమెకు కనుపించలేదు. ఒకరితో ఒకరు మాట్లాడుకోరు. మాట్లాడినప్పుడైనా యేదో వాదించుకుంటూ వుంటారు. ఒక చాటునుంచి వీళ్ల సంగతంతా వింటూ కంటూ వున్న సుందరమ్మ అప్పుడప్పుడూ నవ్వుకునేది.

పద్మకూడా అంత చదువెందుకూ? ఈయింట్లో వాడకుండా వున్న సామానులు, బంగారునగలు...అబ్బా అనవసరంగాయింత డబ్బు దిండుచెయ్యటంవలన యేం లాభం? అమ్మిపద్మకు కాస్తజ్వరం కాసిందని యెందరొచ్చారు? రెండువందలిచ్చి యింటి యజమానురాలు ఒక చీరె కొన్నది. ఇంటి యజమాని పదిగంటలవరకూ యింటిదగ్గరే వుంటాడు. సాయంత్రం వేగంగానే వచ్చేస్తాడు. అన్నయ్య ప్రొద్దున్ననుంచీ ప్రొద్దుగ్రుంకేవరకూ వీళ్లనీ వాళ్లనీ పట్టుకుంటే ఒక రూపాయైనా రాదేం? యీ సందేహాలకి సమాధానం పెద్ద నిట్టూర్పుతో "కర్మఅంతా పూర్వజన్మలో చేసిన పాపం!" అనుకొని శాంతించింది.

* * *

పద్మ చూపుల్లో యెప్పుడూ అదొక విధమైన వుత్సాహంతో కూడుకున్న కొంటెతనం అగపడ్తుంది. నడుం సన్నంగా శరీరం పొందిగ్గా వుంటుంది. చెప్పుకొని మరిచిపోలేనంత అందంలేదుగానీ, మనిషి శృంగారించుకొని నడుస్తుంటే లావణ్యం వుబికివుబికి వెంటాడుతూ వుంటుంది. పెదాలు చేర్చి, బుగ్గలుపొంగించి, ఆలోచనగా కళ్లప్పచెప్పి చిరునగవు వెలబోయటం సరదా.

కృష్ణారావు అదొకతరహామనిషి. తనకు యేవిషయం తెలియనట్లే వుంటూ డింట్లో. పైనమూడేల ఘువులు వేస్తాడు. ఒక్కొక్కసారి యింట్లో వాళ్లమీద విరుచుకుపడటం అలవాటు. అందచందాలవిషయమై ప్రాకులాడటంలో చాలా వుత్సాహం చూపిస్తాడు. ఫోటోలు తీయించుకోవటం సరదా.

సుందరమ్మవచ్చి పదిహేనురోజులైంది. ఇంకా ఆమెకు యింటిమీద ధ్యానం పోలేదు. అన్నయ్యకు వుత్తరం వ్రాయించాలని వుంది. యజమానురాలితో చెప్తే యేమనుకుంటుందో? పద్మని అడగాలనుకుంది. ఎందుకో పద్మను చూశాక భయంవేసేది. కృష్ణారావుని అడిగితే బాగుండుననిపించింది. ఆమెకళ్ల కతడు చాలా మంచివాడిగా కనిపించాడు. ఆమె వండిన వంటకాలని 'ఛీ. బాగులేవు. తిననని' పద్మ ఒకసారి విసిరిపారేసింది. ప్లీడరుగారు 'పల్లెటూరివంటలు మరెలా వుంటయ్' అని హేళన చేశారు. కానీ కృష్ణారావు యేమాటా అనకుండా నవ్వుతూనే తింటాడు. యీ మంచిమనిషిని అడగటంవల్ల తప్పకుండా వుత్తరం వ్రాయించగలననుకుంది. కాని ఆమెకు సిగ్గేసింది. యీ ఆలోచనపుట్టిన మూడురోజులవరకూ ఆయన గదివరకూ వెళ్లి నాలుగైదుసార్లు తొంగిచూచి, మళ్లీ ధైర్యం చిక్కబట్టక తిరిగి వచ్చేది.

నాలుగోరోజురాత్రి కృష్ణారావు చాలా ఆలస్యంగా భోజనానికి వచ్చాడు. మరెవరూ అక్కడ లేకపోబట్టి ధైర్యం కూడబెట్టుకొని లేచిపోయే సమయానికి వుత్తరం వ్రాసిపెట్టమని అడిగింది. ఆయన అలాగే అని చెయ్యి కడుక్కొని వెళ్లిపోయాడు. రెండురోజులవరకూ పిలిచి అడుగుతాడనుకుంది. అటువంటి దేమీ జరగలేదు. అన్నయ్యా, వదినా, మాణిక్యం తన నెంతగా నిందిస్తుంటారో అనుకొని భయపడింది. వాళ్లనిప్పుడు తలచుకుంటుంటే ఒక్కొక్కరూ యెంత మంచివారమ్మా అనిపించేది. అన్నయ్య యెప్పుడూ పల్లెత్తు మాటనలేదు. వదినది పెద్దనోరు తప్పించి మనసు మంచిదే.

ఎలా కాకపోతే లేమిలో అన్నయ్యనీ పిల్లలనీ, తననీ చంపెయ్యకండా జరుపుకొచ్చేది. మాణిక్యం నాలుగు తిట్టి బుద్ధులు చెప్పినా, దుఃఖాన్ని పంచుకొనేది... వాళ్లంతా యెంతమంచివాళ్లు! అంతమంచి వాళ్లకుకోపం తెప్పిస్తున్నానని మనసు వుండబట్టక యజమానురాలిని అడిగింది. ఆమె యేమాత్రంచికాకుపడలేదు! "సరే యేం వ్రాయమంటా"వని అడిగింది. సుందరమ్మ ఆలోచనలో పడింది. వ్రాయమనటానికి యెన్నో విషయా లున్నట్లున్నా ఒక్కటే స్ఫురించ

లేదు. "నేను క్షేమంగా వున్నానని, వదినకూ, అన్నయ్యకూ, మాణిక్యంకూ మ్రొక్కానని వ్రాయడంమ్మా" అంది.

మ్రొక్కడమేమిటే. వాళ్లుగాని దేవుళ్లా-పకే. యింకేమైనా వ్రాయిస్తే వ్రాయించు. నే పద్మతో చెప్తాను" అంటూనే గుజ్జ మాసురాలు వెళ్లిపోయింది. పద్మ పేరంటే చిన్నపిల్లలకు బూచీ పేరులా వుంటుంది సుందరమ్మకు.

ఆ కొద్ది నిమిషాల్లోనే కృష్ణారావు వంట యింటిదగ్గరికి వచ్చి ఆమెవేపు చూడకుండానే యేమి వ్రాయాలన్నాడు. అంతవరకు నీరు వూరుతున్న కళ్లతో యెదురుగా వున్న మంటల్ని చూస్తున్న ఆమె గాబరా పడి కన్నీరు తుడుచుకుంది. జవాబు చెప్పటానికి మాటలు దొరక్క గింజుకుంది. మరచిపోకండా యిన్ని రోజులకైనా వుత్తరం వ్రాయాలని వచ్చినందుకు సానుభూతి చూపించట మెలాగో ఆమెకు తెలిసింది కాదు.

గబగబలేచింది. బట్టసర్దుకొని తడబడుతూ "అమ్మగారితో చెప్పాను" అంది.

పద్మ యెక్కడికో వెళ్లింది. అమ్మ నన్ను వ్రాయమంది. యింకేమైనా చెప్తావా?" అన్నాడు.

"అంతే" అంది తలవంచుకొనే. కృష్ణారావు వెళ్లిపోతేంటే "పెద్దమ్మగారు యాత్రకు వెళ్లారని వ్రాయండి బాబూ" అంది. ఆయన తల పంకించాడు.

ఆ వేళనే వెంకమ్మ వ్రాయించిన వుత్తరం వచ్చింది. పూరీక్షేత్రంలోని జగన్నాథుని దర్శనభాగ్యం లభించిందని, భువనేశ్వరం వెళ్తున్నానని, సుందరమ్మను జాగ్రత్తగా చూస్తుండమని కూడ వ్రాయించింది.

పద్మ వుత్తరం చదివి పకపకనవ్వుతూ అన్నది.

"మామ్మ పిచ్చిగానీ-యింండి దేవుడ్ని చూడగానే మోక్షం వూడిపడిందా? యీ తీర్థయాత్రలక్రింద తక్కువ తగలేస్తోందా?"

"వెళ్లారేగాని ధ్యానంయిటేగా - తగలెయ్యనీ-మనం యేమైనాఅంటే నాతల్లి యిచ్చి చచ్చిందంటారుగా-మనం యెందుకమ్మా చెడ్డఅవటం-ఆపి చ్చేదో కుదరనీ" అని తల్లి అందుకుంది.

యీ మాటలు సుందరమ్మ వినలేక పోయింది. అంత మంచిమనిషిని పిల్లి లాతుల నాడటం, పైగా దేవుని నిందించటం యెంత పాపం! చాలా జోరుగా మాటలు వెళ్లిపోతుంటే కృష్ణారావు వచ్చాడు.

పద్మపదిహేనేళ్ల జీవితంలో, యీ రెండేళ్లలో గడించుకున్న అనుభవంతో అదుపూ ఆపూ లేకుండా వాగటంతో, కృష్ణారావు అడ్డొచ్చి "పూర్తిగా తెలియంది యే విషయంగురించీ పేలకు. మామ్మగురించి మాటాడటానికి యీయింట్లో యెవరికీ హక్కు లేదు"

సుందరమ్మకుపోయిన ప్రాణం మళ్లీ వచ్చినట్లైంది. మన స్సంతా కృష్ణారావుకు జోహారు లర్పించింది. ఆవేళనుంచి ఆయనవేపు రోజుకి వందసార్లైనా చూసి నమస్కరించుకోవాలనిపించేది. వీలుచిక్కినప్పుడల్లా ఆగదివేపు ఒకసారి తొంగిచూసేది.

సుందరమ్మదృష్టిని గుర్తించాడాయన. ఇప్పుడు ఆమె యెదురుగా ముఖం ప్రక్కకు త్రిప్పుకొని కాస్సేపు నిలుచుంటున్నాడు. అప్పుడప్పుడూ ఆమెవేపు చూసేవాడు కూడాను. గంటలు దొర్లుతున్న కొద్దీ కృష్ణారావుగూర్చి ఆమె హెచ్చుగా ఆలోచించటం మొదలుపెట్టింది. తనచుట్టూ, తన నీ మాసుకొనేది. ఆమెలో యిదివరకెప్పుడూ పొందని యేవో తియ్యని భావాలు కమ్ముకుపోయేవి - ఆమెమనసులోనే కాకుండా, శరీరంలోనూ, నడతలోనూ ఒక విధమైన మార్పు గుర్తించుకుంది.

ఆవేళ శనివారం. కృష్ణారావు, పద్మ యింట్లోనే వున్నారు. సుందరమ్మ పదిగంటలుకాకుండానే వంటపూర్తిచేసి తల దువ్వుకుంది. ముఖంలో కుంకుమరేఖ పెట్టుకొని వెంకమ్మ కొనివెళ్ళిన తెల్లని చీరె, జాకట్ వేసుకొంది. మేడమీద నిల్చొని రోడ్డుమీద వచ్చేపోయేవాళ్లని చూస్తోంది. పద్మయెలా కనిపెట్టిందో నవ్వునాపుకుంటూ క్రిందికివచ్చి అన్నయ్యదగ్గర నవ్వుతూ "ఒక్కసారి మేడ మీదకు వెళ్లు చూద్దాం" అంది పందెం వేసినట్లుగా.

కృష్ణారావు మేడమీదకువెళ్లి నిశ్చింతగా రోడ్డువేపు చూస్తున్న సుందరమ్మవేపు కొంత దూరంలో నిల్చొని చూస్తున్నాడు. పద్మ వొంగి మెల్లెగ బాకి చెవిదగ్గర నోరుపెట్టి మెల్లగా, "భావకవీ! యే లోకంలో విహరిస్తున్నావ్?" అంది. కృష్ణారావు గాబరా కప్పిపుచ్చుతూ "గతిలేని లోకంలో మతిలేని మనుషులమధ్య" అన్నాడు. యీ మాటలు విన్న సుందరమ్మ సిగ్గుతో దాగుండిపోవటం అన్నా చెల్లెలూ చూడకుండానే మేడ దిగారు.

* * *

ప్లీడరుగారింకా కోర్టునుంచి రాలేదు. పెరటివాకిట మల్లెపొదప్రక్కన ఒక టేబిల్ చుట్టూ కుర్చీలు అమర్చి, పద్మ, యజమానురాలు, కృష్ణారావు కూర్చొని ఒకావిడతో పిచ్చాపాటీ మాట్లాడుతున్నారు. వంట చేస్తున్న సుందరమ్మపోపుసామానులు తెచ్చుకోడానికి స్టోరుగదిలోనికి వెళ్ళింది.

"యీపిల్లని యిదివరకు చూడలేదే?" అంది ఆ క్రొత్తావిడ.

"చుట్టపు చూపుకు అదేదో పల్లెటూరు వెళ్ళి అత్తగారు తీసుకవచ్చారు. ఇల్లరికం వచ్చిన అల్లుడు కాపదానితో కలకత్తా పోయాడట. తల్లీతండ్రీ లేరు. అన్నదమ్ము డొక దద్దమ్మ. యాత్రలకి దయచేశారుగా. మేం బాధపడిపోతామని వంటకోసం తెచ్చి పెట్టారు!"

ఇంత పెద్ద సమాధానం యేమీ కాదన్నట్లుగా వింది ఆవిడ. సుందరమ్మ సామానుల గదిలో సగం చచ్చింది. పద్మ పకపక నవ్వుతూ "మనిషిని చూశారుగా. భూలోక రంభకమూ! మామ్మ సుందరీ అని నోటికింపుగా పిలిచేదండీ. అబ్బా...యేమి సౌందర్యం! ఆభావకవులే వర్ణించుకోవాలి."

అంతా ఒక్కసారి ఫక్కున నవ్వారు. అంగుల్లో కృష్ణారావు ఒకడని గుర్తించుకున్న సుందరమ్మకు గుండె ఆగిపోయినంత పనయ్యింది. తెప్పరిల్లినా ఆ చేతులతోనే ముక్కూ, చెవులూ, బుగ్గలూ, కళ్లూ వూడబెరుక్కోవాలన్నంత అసహ్యం వేసింది.

"ఆ దేవుడిమీద యెంత భక్తంటారు! పసుపు పులుముకుని స్నానంచేసి ఆ గదిలో గంటసేపు కాలుచుకు కూర్చుంటుంది. యీ మట్టి బొమ్మల్లో ఆ దేవుడు వీళ్లకోసమే దాగున్నాడు" పద్మ యేదో పెద్దవిషయం కనిపెట్టినట్లు చెప్తుంటే సుందరమ్మ వినలేక పోయింది.

ఈసారి కృష్ణారావు బిగ్గరగా నవ్వుతున్నాడు. నాగరికతతో మిలమిల మెరిసిపోతున్న ఆవిడ యెదరగా తన నాగరికత చూపించొద్దూ!

సుందరమ్మకు యిదంతా ఒక నరకంలా కనిపించింది. ఇందులో దేవుణ్నే తిట్టారు! హేళనచేస్తారు! ఇంకేం చెయ్యరు! వీళ్లంతా పెద్ద ముక్కులతో వున్న యినప కాకులు! వెంకమ్మ అందుకోసమే యిక్కడ

నుంచి వెళ్లిపోయింది! తనుకూడ వెళ్లిపోవాలనుకుంది. కానీ వదినా, మాణిక్యం యెంత ఆడిపోస్తారు. ఎప్పుడు బాధపడినా 'నేనున్నానని' చెప్పి సహాయంచేసేది ఓదార్చేది ఒక్కటే - కన్నీరు!

పచ్చి వ్యభిచారిని 'సీతా'అని పిలిస్తే యీ లోకంలో యెవ్వరైనా నవ్వుతారనుకోను. కానీ ఒక అందవిహీనురాలైన యువ్వనిని 'సుందరీ' అని నోటికింపుగా పిలిస్తే ఒక్కరైనా నవ్వకపోరు. ఈ సీతాదేవి ప్లీడరు సలహాకి వచ్చింది. బాగా చదువుకుంది. మస్తుగా డబ్బుంది. మొగుడికి విడాకులివ్వటంగురించి సలహా తీసుకోడానికి వచ్చింది. సుందరమ్మగురించి నవ్వింది!

ఉప్పునీటినూతిలో కప్ప నిర్మల జల ప్రవాహాన్నిగురించి నూతిదగ్గరకు వచ్చిన వాళ్లు చెప్పుకుంటే విన్నది. సమర్థతా, శక్తి లేక అదంతా మిథ్య అన్నది. ఈ వుప్పునీరే ప్రపంచం, బ్రతుకూ, అంతానూ......

పద్మ హేళన చేసి నవ్వింది!!

*      *      *

సుందరమ్మ వచ్చి నెలరోజులైంది. వచ్చినరోజున వెంకమ్మను చూసి మనసులో కొంచం శాంతి యేర్పడేది. కాని యిప్పుడు అశాంతి మనసులో పెనుగులాడుతూనే వుంది. మాటిమాటికీ కృష్ణారావు ఆమె యెదట పడటం, యిదివరలా అతని ముఖం వేపు చూస్తుందో లేదో అని వుబలాటపడటం జరుగుతోంది. సుందరమ్మ పొరపాటునైనా ముఖం యెత్తలేదు. అందమైన ఆడదానిముఖంకోసం కథల్లోనూ, కలల్లోనూ పరితపించే కృష్ణారావుకు వికారమెత్తింది. తను అందగాలేనేమోనని పదిసార్లు అద్దం తీయించుకున్న అన్ని ఫొటోలు చూశాడు. సుందరమ్మ తన అందాన్ని కాదు, మనసును ప్రేమించిందని అనుకోవటానికి తగ్గ జ్ఞానమైనా లేకపోయింది! అందరూ తన అందాన్ని గుర్తించి స్తుతించుకోవాలనే వుబలాటలతో వున్న కృష్ణారావుకు యీ మార్పేమీ బాగా లేదు.

సుందరమ్మకు బ్రతుకుమీద అసహ్యం వేసినా, అన్నయ్య యెముకలపోగైనా చూపించిన అభిమానంతో యీ నరకంలో బ్రతకనిస్తున్నాడు. ఈ నరకంలో తనెలాగో పాపం అనుభవించి బాధపడటం తప్పించి, అక్కడే ఒక స్వర్గం నిర్మించేశక్తి లేదనుకుంది.

ఇంటి యజమానురాలు మధ్యాహ్నమే చెప్పింది సాయంత్రం అయిదుగంటలకే వంట కావాలని.

సుందరమ్మ వంట చేసి కూర్చుంది. "బట్టలు మార్చు. సినీమాకి వెళ్దాం" అని చెప్పి హడావుడిగా వెళ్లిపోయింది. సుందరమ్మకు మొదట వెళ్లాలని లేకపోయినా, ఇదివరకు సినీమాగురించి విన్నదికాబట్టి అదేమిటో చూద్దామనే కుతూహలంపుట్టింది.

సుందరమ్మనొక్కర్తెను దిగువక్లాసులోకి పంపించి పక్కా గంటసేపు అలంకరించుకోవటంవల్ల వచ్చిన వయ్యారంతో తల్లీ కూతురు వెళ్లి కుర్చీల మీద కూర్చున్నారు. హాలునిండా జనం క్రిక్కిరిసివున్నారు. ఆమెచుట్టూ వున్న ఆడవాళ్ల వేపే అమాయకంగా చూస్తోంది. అపరిచితులతో మాటలెలా కలపడమనే విషయం అటుంచి, కలపటంగురించే ఆలోచించలేదు.

తెరమీద బొమ్మలుపడ్డాయ్. రానురాను దేవుళ్లు కనిపించారు. మనస్సంతా భక్తితో నిండిపోయింది. నోరు ఆవలించి అమాయకంగా యేదో అనుభూతి పొందుతోంది.

దీపాలు వెలిగాయ్. పెద్ద సంశయంతో కొట్టుకుంటున్నా వెళ్లిపోవాలని లేచి నిలబడింది. చుట్టుప్రక్కలవాళ్లెవరూ కదల్లేదు. ధైర్యం తెచ్చుకొని "అవునమ్మా ఆ రాధ యేమైంది?"అని ప్రక్కావిడని అడిగింది. సావధానంగా "కూర్చో అమ్మా! చూద్దువుగాని" అంది ఆవిడ.

కొంతసేపట్లో దీపాలు ఆరిపోయాయ్. అవేవో రంగురంగుల అక్షరాలు, బొమ్మలు అగపడ్డాయి. వెంటనే శ్రీకృష్ణుడు కనిపించాడు. మనస్సంతా భక్తితోనిండిపోయింది. రెప్పవేస్తే దేవుడెక్కడ మాయమైపోతాడో అన్నట్లుగా చూస్తోంది...

సినీమా విడిచిపెట్టారు. బండిలో కూర్చున్నా కళ్ల యెదురుగా గోకులం, రాధా, కృష్ణుడు...వున్నారు. ఆనందంతో మనస్సంతా లూగులాడింది. ఆ రోజు ఒకగొప్ప పుణ్యదినం అనుకుంది.

ఆరాత్రి ఆమెకు నిద్ర రావటంలేదు. మనసునిండుగా తృప్తి వుంది. ఆలోచిస్తున్న కొద్దీ రాధకు జోహారు లర్పించుకుంటోంది. గోకులంలో అందరూ ఆమెను నిరాకరించారు. తిట్టారు, కొట్టారు...ఇంత చేసినా నవ్వుతూ, ఆడుతూ...ఆ కృష్ణుని...యీ ధోరణిలోనే సుందరమ్మ తన పని చేస్తోంది.

ప్రక్కనే వున్న రెండు గదుల్లోనూ చాలా రాత్రివరకు దీపాలు వెలుగుతున్నయ్.

ఒకసారి పద్మగదివేపు తేరిపార చూచింది. పుస్తకంలో ఒక యువకుని ఫోటో పెట్టుకొని పద్మ దీక్షగా చూస్తోంది. అప్పుడప్పుడూ వక్షానికి అదుముకుంటోంది.

ఆమెదృష్టి మెల్లగా ఆగదిలోనే టేబిలు మీద వున్న మురళీకృష్ణుని వేపు పోయింది. కళ్లు అప్పచెప్పి చూస్తోందేగాని మనస్సంతా రాధతోనే నిండిపోయింది. తన కష్టాలకీ రాధకష్టాలకీ యేదో సంబంధం వుందనికూడా అనుకుంది...

రానురాను...అదేదో మగతలా...ఒడ్డుకు కొట్టుకుపోవాలని ఆత్రుతపడే సముద్రతరంగాలలా, ఆమెలో భక్తితరంగాలు ఆత్రుత పడుతున్నాయ్.

పద్మ దీపం ఆర్పి పడుకుంది. చాలసేపటివరకూ సుందరమ్మ ఒళ్లంతా జలదరిస్తునే వుంది...అదోకలా అయిపోయింది...లేచి నది...నవ్వుకుంది...చేతులు గట్టిగా దులుపుకుంది...పద్మగదిలోకి వెళ్లింది...

ఒళ్లంతా వుబ్బిపోయింది. మనస్సంతా భక్తితో పొంగిపోయింది. కరటాల్లా చేతులు ఆడిపోయాయ్. తల బరువెక్కిపోయింది. మురళీకృష్ణుని పాదాలమీద తల ఆన్చి గట్టిగా కౌగిలించుకుంది.

వినీలాకాశంలో చందమామ చంద్రికలు వెదజల్లుతున్నాడు. భక్తీ, ప్రేమా, అనురాగం త్రివేణీలా కలసిపోయాయ్...చెక్కిళ్లపైనించి మెల్లగా కన్నీటిధారలు జారుతున్నయ్...

ఏమంటుందో యేం చేస్తోందో...భక్తిలోలీనమైతాను అనుకున్న నరకంలో మానవమాత్రుల కెవరికీ అక్కరలేని తన శరీరం వున్నదనే విషయం మరచిపోయిందేమూ!

మెలుకువ వచ్చేసరికి గది కాంతివంతంగా వుంది. వాళ్లంతా యెవరో యెందుకు నవ్వుతున్నారో ఆమె కేమీ అర్థంకాలేదు. పద్మ గొంతుకమాత్రం పోల్చింది.

"సినీమా అంతా నిజం అనుకుంది. పాపం! లే అమ్మా రాధాదేవీ! ఆ పూలదండ నలిపేశావ్ - గదిలోకి యింకెప్పుడూ రాబోకు!"

యీమాటలు వినటానికి కటువుగా వున్నా, సుందరమ్మ మనసులో నవ్వుకొని అనుకుంది. "ఈ నరకంలోనే ఒక స్వర్గం వుంది. దేవుడే నన్ను ప్రేమించేటప్పుడు- మీరు ప్రేమించకుండా బ్రతగ్గలరా? మీరే మున్నా ప్రేమతోనే అంటున్నారు!"

---

## హైడ్రోజన్ బాంబు

(23 వ-పేజీ తరువాయి)

న్యూట్రాన్లు చుట్టూ పరుగులుతీస్తాయి. పరమాణువులన్నీ మారిపోయి కొంత పదార్థం విపరీతమైన శక్తిగా పరిణమిస్తుంది.

హైడ్రోజన్ బాంబులవల్ల ఎంత శక్తి ఉద్భవిస్తుంది? మామూలు ఏటంబాంబుల కంటే (అనగా యుద్ధంలో జపాన్ పైన ప్రయోగించబడిన యురేనియంబాంబుల కంటె) హైడ్రోజన్ బాంబులు శక్తివంతాలైనవని శాస్త్రజ్ఞులు చెప్పుతున్నారు. నిజాని కిన్ని రెట్లుండకపోవచ్చు. నిర్మాణంలో సమస్యల్ని బట్టి చూస్తే పదిరెట్లకంటె శక్తివంతమైన హైడ్రోజన్ బాంబుల్ని తయారుచెయ్యటం అసాధ్యమని కొందరిఅభిప్రాయం. యురేనియం బాంబులు అట్టే పెద్దవిగా ఉండటానికి వీల్లేదు. అట్టే పెద్దవిగా తయారుచేస్తే, విమానాల్లో తీసికెళ్లి శత్రువుల పట్టణాలపైకి విసిరేవరకూ ఊరుకోవు. తయారైన క్షణంలోనే పేలిపోతాయి. హైడ్రోజన్ బాంబులు అల్లా కాదు. ఎంత పెద్దవానినైనా నిర్మించవచ్చును. చేతనైతే ఒక ఓడంత బాంబుని తయారుచేసి ఏమీ ఎరగనట్టు శత్రువుల ఓడరేవుకి తీసుకుపోయి అక్కడ పేల్చెయ్యవచ్చును. అంత పెద్ద బాంబు పేలిస్తే భూమి బ్రద్దలైనంత అల్లరి జరుగుతుంది కాని భూమి బ్రద్దలు కాదు. తీరా హైడ్రోజన్ బాంబుని పేలిస్తే నీళ్లలోనూ గాలిలోనూ కూడా హైడ్రోజన్ ఉంటుంది. కాబట్టి ఆ పేలుడు బాంబుతో ఆగక సముద్రపు నీటిలోనూ వాయువులోనూ ప్రేలుడు ప్రారంభించవచ్చునని కొందరి అనుమానం. కాని అది అసంభవమని శాస్త్రజ్ఞులు చెప్తున్నారు. హైడ్రోజన్ బాంబు పేలడానికి ముందు ఏటంబాంబు పేలి, విపరీతమైన వేడిమి పుట్టాలి. అంత వేడిమి నీటికిగాని వాయువుకిగాని కలిగే అవకాశంలేనందువల్ల వరసగా సముద్రమూ ఆకాశమూ పేలుళ్లతో నిండిపోయే ప్రమాదంలేదంటారు.

ప్రపంచంలో దొరికే యురేనియం బహుకొద్ది. హైడ్రోజన్ కావాలంటే ఎక్కడబడితే అక్కడే ఎంత కావలసివస్తే అంత సిద్ధపరుచుకోవచ్చును. యురేనియంబాంబులు విధిగా చిన్నవిగా ఉండాలి. హైడ్రోజన్ బాంబులు ఎంతపెద్దవైనా ఉండవచ్చును.

నిజానికి హైడ్రోజన్ బాంబు ఎంత శక్తివంతమైనదో ఒకటి పేల్చిచూస్తేకాని తెలియదు. త్వరలోనే అమెరికన్లు పసిఫిక్ మహాసాగరప్రాంతంలో ఒక హైడ్రోజన్ బాంబుని పేల్చిచూస్తారట. రష్యన్లుకూడా త్వరపడుతున్నారట.

## హిమకన్య

(27-వ పేజీ తరువాయి)

గుజ్జులు సమ్మతించలేదు. బంగారంవంటి అమ్మాయే దక్కనప్పుడు నీ ధనంతో పనిలేదన్నారు. రాజకుమారుడు హిమకన్య లేకుంటే తాను బ్రతకలేనన్నాడు. తనకిస్తే ప్రాణంతో సమంగా చూస్తానన్నాడు ఆ సుందరవిగ్రహాన్ని. మరుగుజ్జుల మనసు కరిగింది. ఇచ్చారు. రాజకుమారుడు సేవకులభుజాలపైన ఆపెట్టెను పెట్టి తీసుకువెళ్లాడు. దోవలో ఒకబండమీద ఒకసేవకుని కాలు జారి పెట్టె భూమిమీద పడి పగిలింది. ఆ కుదుపుకు హిమకన్య నోట్లో ఉన్న పండుముక్క కింద పడిపోయింది. ఆమెకు ప్రాణం వచ్చింది. రాజకుమారుడు హిమకన్యకు తన కథంతా చెప్పి ఆమెను పెండ్లాడతానన్నాడు. ఆమె సమ్మతించింది. రాజకుమారుడు తనరాజ్యం చేరగానే పెండ్లికి సన్నాహాలు చేశాడు. విధివశాత్తు మాయలరాణికి కూడ పిలుపు వెళ్ళింది. ఆమె తనకున్న నగలన్నీ ధరించి, అద్దంముందు నిలిచి గర్వంతో,

"ఎంతైనఅద్దమా వినిపింపు నాకు
అందాన నాలాటి అతివలున్నారా?"

అని ప్రశ్నించింది. అందుకు అద్దం ఇలా నిజం పలికింది.

"పేరుగన్న మా పెండ్లికూతురగు
హిమకన్యామణి అందం ముందర
హీనులుకారా రాణులుకూడ?"

పరాభవంతో కంపించిపోయింది రాణీశరీరం. హిమకన్యవివాహం సమాచారం తెలిసివచ్చింది. ఈర్ష్య పట్టలేక కాలకూటవిషాన్ని తానే త్రాగి మరణించింది.

## బాలవిజ్ఞానం

(28 వ-పేజీ తరువాయి)

ధ్రువాలదగ్గరి ఖండాలు, దేశాలు, పట్టణాలు, పల్లెలు, ఇళ్లు, వాకిళ్లూ యావత్తూ మంచుతో నిండిపోతాయి. మళ్లీ వేసంకాలం రావటంతోటే ఆ మంచంతా కరిగి అడ్డదిడ్డాలుగా ఒకదోవా తెన్నూ లేకుండా ఊళ్లమీద యిళ్లమీద నీళ్లు పారుతుంటాయి. ఈ అవస్థలు పడలేక అక్కడి మహామహామేధావులైన ఇంజనీర్లంతా కలిసి ధ్రువాలదగ్గరినుండి ఆలోకానికి నిలువుగాను, అడ్డంగాను కొన్ని వేలూ లక్షలూ నదులు త్రవ్వేశారు. చిన్న చిన్న సముద్రాలంత చెరువులుగూడా త్రవ్వేసినట్లు కనిపిస్తుంది. వాళ్లకు వానలు లేవుకాబట్టి వేసంకాలంలో గూడా ఏమాయిబ్బంది పడకుండా మంచినీటికి చక్కటి సదుపాయాలు చేసుకున్నారు. ఇప్పుడాకరిగిన మంచంతా వేసంకాలంలో నీరై ఆనదుల్లో పారుతుంది. ఆ నీళ్లల్లోపడి యిష్టమొచ్చినట్లు ఈతలుకొట్టవచ్చు..." "అయితే వాళ్ళలోకంలో ఇప్పటి పిల్లలకు పర్వతాలంటే ఏమిటో తెలియదుగాని, కొన్ని కోట్లసంవత్సరాల క్రింది టున్న పిల్లలకు తెలిసే ఉంటుంది. వాళ్ళ కాలంలో పర్వతాలు ఆలోకంలో కూడా ఉండేవుంటాయి. కాలం గడిచిపోయే కొద్దీ పర్వతాలుగూడా క్రుంగిపోతుంటాయి. మన హిమాలయపర్వతాలు కూడా కుంగి కొంతకాలానికి భూమట్టంతో సరిసమానంగా అణిగిపోవచ్చును. అయితే ఎన్నోకోట్ల సంవత్సరాలకుగాని అది జరగదు. అప్పటిలోపల సూర్యుని విపరీతపు వేడికి భూలోకంలో పిల్లలు, పెద్దలు అంతా మలమల మాడి సలసలక్రాగిపోయి ఉంటారు కూడా! అందుకనే భూదేవి తన పిల్లలను రక్షించటానికి సూర్యుని కన్నా దూరదూరంగా జరుగుతోంది. అయితే ఒక వందసంవత్సరాలకు ఒక గజము దూరం పోతోంది. అంటే సూర్యుడిప్పుడు మనకు సగటున 9 కోట్ల 30 లక్షల మైళ్ళ దూరాన ఉంటే, యింకో వందసంవత్సరాలకి 9 కోట్ల ముప్పయిలక్షలపైన యింకో గజముదూరంలో ఉంటాడు. [ఇంకావుంది]

# మధురభారతి మాధవపెద్దికవి

(17 వ-పేజీ తరువాయి)

పద్యాలు కొన్ని యున్నవి. పెళ్ళిళ్ళుకాని కూతుళ్ళగూర్చి ఆయనఆవేదన వెల్లడించే పద్యాలున్నవి. ముగ్గురు కుమార్తెలకూ వివాహమొనర్చి, ఆయన స్వగ్రామమగు బ్రాహ్మణకోడూరులోనే స్వగృహంలో తల్లిగారితో జీవిస్తుండగా ఆయన ఉబ్బసపువ్యాధి అధికమై వైద్యంనిమిత్తం తెనాలిలో డాక్టరు గోవిందరాజుల వెంకటసుబ్బారావుగారివద్దకు వచ్చారు. సుప్రసిద్ధనటులు రసికులు కవితాకళాభిలాషులు నగు డాక్టరుగారితో ఆయనకు పరిచయమేర్పడి, అది స్నేహంగా మారింది. డాక్టరుగారి ప్రోత్సాహంపైన వారు అనేక హాస్యరసకావ్యాలు రచించారు. వారి తొలిగ్రంథం 'బృందావనం' డాక్టరుగారి ప్రోత్సాహంవలననే ముద్రింపబడింది. తెనాలిలోనే వారికి సుప్రసిద్ధన్యాయవాదులు కళాభిమానులు నగు శ్రీ వేదాంతం లక్ష్మీనారాయణగారి స్నేహంకూడా లభించింది.

ఆయన డాక్టరుసుబ్బారావుగారి స్నేహితులందరికీ స్నేహితుడైనాడు. తెనాలిలో ఏసభ జరిగినా ఆయన ప్రార్థన పద్యాలు చదవడముండేది. ఇక ప్రతి సంవత్సరం దసరాకు దేవీచౌకులో, శ్రీరామనవమికి హనుమాన్‌చౌకులో జరిగే ఉత్సవాలలో, సంస్కృతకళాశాలలో జరిగే గణపతిఉత్సవాలలో వారి పద్యపఠనం - ముఖ్యంగా హాస్యరచనల పఠనం - ఉండేవి.

ఆయనపద్యాలు ఆయనముఖతా వినాలని ప్రజ లుత్సాహపడేవారు. మాధవపెద్దికవిగారు అద్యతనవిషయాలమీద చమత్కారంగా పద్యాలు రాసేవారు. హైదరాబాదుపోరాటం ముగిసినపిదప సైనికులగురించి ఆయన తమాషాపద్యాలు రాశారు, రేషనింగుగూర్చి రాశారు. ఒకటేమిటి, ఆయన ఎల్లప్పుడూ పద్యాలు రాస్తుండేవారు. ఎల్లప్పుడూ ఆయనచేతిలో ఒక తెల్లకాగితాల పుస్తకం, ఒక పెన్సిలు, పొడుండబ్బీ ఉండేవి. ఆయన తరుచుగా చొక్కాధరించేవారు కారు. ఒక ఉత్తరీయం. తరుచుగా గోచీఊడిపోతూ ధోవతీ! లంబోదరం! వామనరూపం!

తెనాలిలో నాలుగైదు వత్సరాలనుంచీ శ్రీ మాధవపెద్దికవిగారు ఆయన మూడవ కుమార్తెవద్ద ఉంటున్నారు. రామలింగేశ్వరపేటలో రెండుసంవత్సరాలు మాబావగారి యింటిప్రక్క డాబాలో వా రుంటంవల్ల ప్రతిదినం వారితో ముచ్చటించే అవకాశం నాకు కలిగింది.

ఒక సంవత్సరంనుండీ మాధవపెద్దికవిగారికి శరీరారోగ్యం సరిగా నుంటంలేదు. ఉబ్బసవ్యాధి యుండగా - పైన నీరు చూపించి. 1949 సెప్టెంబరులో బెజవాడలో జరిగిన వెంకటశాస్త్రిగారి ఆస్థానకవి సమ్మానమహోత్సవానికి ఆయన వెళ్లలేకపోయారు. ఆయన ఆఖరుసారి పద్యాలు చదివింది గుంటూరుహిందూకళాశాలలో జరిగిన ఆంధ్రవారోత్సవాలలో. 1949 జూన్‌లో తెనాలిలో శ్రీగోగినేని వెంకటసుబ్బయ్యనాయుడు పశువైద్యశాల 20 వ వార్షికోత్సవసందర్భమున సన్మానింపబడిన 18 మందిలో శ్రీ శాస్త్రిగారొకరు.

వ్యాధి నానాటికీ పెరుగజొచ్చింది. అందువల్ల ఆయన తెనాలిలో తన స్వంతస్థలంలో ఒక గడిపట్టు డాబా నిర్మించుకుని అందులో ప్రవేశించి మూడుమాసాలుకూడా కాలేదు. ఆయన అకస్మాత్తుగా గుండె ఆగిపోయి 6-2-50 మధ్యాహ్నం ఒంటిగంటకు పరలోకాని కేగారు.

శాస్త్రిగారు జబ్బుతో బాధపడుతూ నాతో ఒకరోజున అన్నారు. "కామేశ్వరరావుగారూ! నా కేం కావాలి! జీవితంలో పొందవలసిన భోగాలన్నీ పొందాను గౌరవాలు పొందాను! ఎందరో ఉత్తములైన స్నేహితుల వాత్సల్యాన్ని పొందాను. నా ముగ్గురు కుమార్తెలు చక్కగా నుండగా నేను మరణిస్తే నా కింకేం కావాలి?" కాని ఆయనకు మూడవకుమార్తె రాజేశ్వరమ్మ గురించీ, ఆమె ఏకైకపుత్రుడు సాయివెంకటకామేశ్వరరావుగూర్చి మానసికంగా ఆవేదన తుదిఘడియవరకుండటం నేను గుర్తించాను. ఆయన ఎక్కువగా ప్రేమించింది ముగ్గురు కూతుళ్ళకంటే సాయీనే! సాయీకి సాయీయే తోడ్పడతాడు!

ఇక ఆయనకవితాశక్తి భక్తిముక్తిదాయకమై ప్రజల కనురక్తి కలిగించేదిగా విరాజిల్లుతున్నది. ఆయన నిత్యజీవితంలో కల్లాకపటం ఎరుగకపోవటం - ఆయనపద్యాలలో ప్రతిపదంలో ప్రతిఫలిస్తుంది! ఆయనలో గంభీరమగు శాక్య ముండేది. ఇక హాస్యమాయనపద్యాలకు ప్రాణం - జీవితంలో కష్టపరంపరలను మరపింపగల రసం!

భక్తితో శివుడ్ని పొగడుతూ దేవుని రూపాన్ని హాస్యంతో వెక్కిరిస్తాడు. "ఒకతే చాలు గదయ్యా! యేలుకొన నీహోదా కటయ్యా! ఒకర్తుక తలపైన... నీ మొకముక్ మూమొక మేమి రూప మిది శంభూ! ప్రేతభూత ప్రభూ!" అను పద్యంలో భక్తితో హాస్యమును జోడించినాడు.

"ఒకలంబోదరుడైన పుత్రకుడు ను
న్నన్నట్టిదే నీకు జా
లక కాబోలును సృష్టిజేసితివి యీ
లంబోదరుంగూడ, దీ
గకు గాయల్ బరువౌనకాని, కుడుముల్
గల్పించి యవ్వానికే
లొకొయివ్వానికినొక్కమైని యిడుమల్
మొల్పింతు మృత్యుంజయా."
"ఒకబిల్వార్చనయేని వీ డెఱుగునో,
యొక్కొక్క టేయొంటిమీ
దికి నిన్నేడులు వచ్చి యొక్క శివరా
త్రింగాని వీ డుండెనో,

మొక మేలాగున జెల్లి వాదెఱిచెడిన్
మోక్షమ్ము నిమ్మంచు నే
టికి నా మ్రొక్కిన మ్రొక్కె చాలు నన్నుగొం
కే తప్ప మృత్యుంజయా !"

ఇక ఆయన ఈతిబాధలు - ఆయన వేగాక అవి ప్రజలందరివీ అన్నంతసూటిగా, రసవంతంగా కనిపిస్తాయి.

"నోటన్ బల్కగరాని పాపముల నె
న్నో చేయుచున్నాడ, ఆ
మాటే పట్టదు నాకు, నీ వయిననున్
బట్టించుకోనట్లె యీ
నాటన్ గూడను గానవత్తు విటులే
నమ్మించి, చేజిక్కునా
పేటన్ మంతువో యంచు గుండె దిగులౌ
నే తండ్రి! మృత్యుంజయా !"

అయన 'మృత్యుంజయ శతకం' రసవంతంగా కన్పిస్తున్నది. అందలి భావాలు నిత్యనూతనములు.

ఆయన పాండిత్యప్రకర్ష మునంతా పద్యాలలో జొప్పింపక పద్యములు సులభగ్రాహ్యములుగా రచించగల నేర్పు కలవాడు. ఆయనసమాసాలు, శబ్దాలంకారములు సరళముగా భాసిస్తవి. భావాన్ని ప్రధానంగా చూచి తగినభాషలో అర్థవంతముగా వ్రాయగల ప్రతిభ ఆయనలో సర్వత్రా శోభించుచున్నది.

ఆయనశబరికావ్యం అత్యుత్తమస్థానం ఆక్రమించుకుంది. "శబరి"లో ఆయన హనుమంతుని ప్రార్థిస్తూ !

"చదువం చున్నదియే మొ యున్నయదిలే
చాలింక - సంగీతనా
రదసాహిత్యచతుర్ముఖత్వములు నే
రమ్మన్న రానేర వీ
ముదిమిన్ - బుట్టుకతోడి నాకవనమున్
బొమ్మన్న చో బోవ దం
త్యదశన్ సైతము నిల్పుమోయి హనుమ
న్నా ! దీని నాకల్పమున్ !"

నిరాడంబరుడు, పండితుడు నగు శ్రీమాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రిగారి వాక్కు నిత్యనూతనసత్యగాంభీర్యముతో విరాజిల్లుతున్నది.

ఆయనకవితాత్మకు శాంతి నొసంగుటకు భగవంతుని ప్రార్థిస్తూ - ఆయనకవితాపరిమళం ఆంధ్రులాస్వాదించి అందలి మాధుర్యాన్ని పొందవలెనని కోరుచున్నాను.

'శబరి'లో లీనమై, ఆయనే శబరియై శ్రీరామచంద్రుడ్ని ఆరాధించినంత చక్కగా నున్న దాయన'శబరి'.

శబరికి మోక్షము సాక్షాత్కరింపచేస్తూ,

"శబలబ్రహ్మము నావరించిన ప్రపం
చంబిట్లు సర్పంబునన్
గుబుసం బిట్లు శరీర మియ్యదియు నీ
కుంగట్టె నిన్నాళులో
శబరీ ! రూపమునందరూపతను సా
క్షాచ్ఛ్రీవికుంఠమ్మునన్
దబిసుల్ మున్నైవ రందజాలని విము
క్తత్వమ్ము గైసేయుమీ !"

అన్నట్లుగా శ్రీ మాధవపెద్దికవిగారికి వైకుంఠావాసము సిద్ధింపజేయుటకు శ్రీమహావిష్ణువును ప్రార్థించుచున్నాను.

# గ్రంథ సమీక్ష

## బుర్రకథ:

నవీనభారత్ : రచయిత శ్రీ ప్రయాగ నరసింహశాస్త్రి. ప్రచురణ: జాతీయజ్ఞాన మందిరం, 4 మునియప్పిళ్లెవీధి, కోమలేశ్వరంపేట, మద్రాసు 2. వెల 4 అణాలు.

శ్రీ ప్రయాగవారి బుర్రకథలు రేడియో ద్వారా ఆంధ్రదేశానికి చిరపరిచితాలే. రిపబ్లిక్ సంస్థాపనసందర్భం పురస్కరించుకుని వీరు మూడేళ్ల పరిపాలనలో కాంగ్రెస్ సాధించిన కార్యాల్ని గురించీ, నవ్యభారత రాజకీయవ్యవస్థలో కాంగ్రెస్ సంస్థ నిర్వహిస్తున్న పాత్ర గురించీ బుర్రకథగా వ్రాశారు.

కాంగ్రెస్ ప్రభుత్వానికి సంబంధించినంతవరకూ సులువైన భాషలో సమీక్ష చేశారు. సామాన్యంగా అందరికీ కలిగే సందేహాలు, ఇప్పుడు తరుచు వినవచ్చే విమర్శలకు కాంగ్రెస్ వారి సమాధానాల్ని సమయోచితంగా పాటరూపంలో చేర్చారు.

అయితే బుర్రకథలో వ్రాసే విషయంలో సంవత్సరాలపేర్లు రాజ్యాంగపారిభాషిక పదాలు పాటని అక్కడక్కడ కుంటుపడ చేస్తున్నాయి. బుర్రకథ పామరజనానికోసం కూడా (వారికోసమే ముఖ్యంగా అంటే అది వివాదాంశమేమో మరి) ఉద్దేశింపబడినదైతే, చెప్పేవిషయాన్ని సంకీర్ణపదజాలంతో నింపితే వినేవారికి శ్రద్ధలోపించగల ప్రమాదం ఉంటుంది. సంగ్రహంగా అందరికీ బోధపడే వ్యావహారికఉపమానానాలతో చెప్తే బాగుండేది.

కాంగ్రెస్ నాయకులవాదాన్నీ వారి విధానాల్నీ ప్రజల్లో బుర్రకథద్వారా ప్రచారం చెయ్యడానికి శ్రీప్రయాగవారుచేస్తున్న కృషి ప్రశంసాపాత్రమైనది.

## హిందీ - తెలుగు స్వబోధిని:

శ్రీపాగా వెంకోబరావు. ప్రకాశకులు నవభారత్ పబ్లిషర్స్ లిమిటెడ్, కర్నూలు. వెల 6 అణాలు.

హిందీభాషను స్వయముగా చదువను మాట్లాడను నేర్వగోరువారికి సులభముగా బోధపడురీతిని రచించబడిన 60 పేజీల చిన్న పుస్తకం ఇది. ఉన్న కొస్తవ్యాకరణాన్నీ, ముఖ్యంగా క్రియాపదాల లింగవచన భేదాలను సులువుగా అర్థమయేటట్లు ప్రయోగపూర్వకంగా వివరించారు. అయితే హిందీ భాషనువ్రాయనేర్చేవారికి పుస్తకం అంతగా ఉపయోగపడుతుందని తోచదు. ద్విత్వాక్షరాలు సంయుక్తాక్షరాల నెలా వ్రాయాలో సరిగా వివరించబడలేదు. ఈనాడు వెలువడుతున్న హిందీస్వబోధినుల సంఖ్య చూస్తే హిందీభాషపట్ల ఆంధ్రదేశానికి గల ఆదరప్రేమలు బోధపడగలవు.

హిందీప్రచారానికై ఈరీతిగా కృషి చేస్తున్న వారందరూ ప్రశంసాపాత్రులు. అయితే వీరే తెలుగులోని ఉత్తమరచనల్ని హిందీలోకి అనువదించి తెలుగుసాహిత్యం ఎంత ఉన్నతిలో ఉన్నదో, తెలుగు సాహిత్యపరుల కృషి యెట్టిదో విశాల భారతానికి బోధపరచవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. వివిధప్రాంతాల సాహిత్యసంస్కృతులను హిందీద్వారా పరస్పరం పరిచయపరిచినట్లయితే భారతీయ సంస్కృతికి సమగ్రము సౌష్టవమూనైన స్వరూపము నివ్వవచ్చును. మన ప్రాంతమున ఈ కృషికి శ్రీ వెంకోబరావువంటి రచయితలు పూనుకొనవలసియున్నారు.



# తాళ్ళపాకవారి పదములు

## శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ

### ౪౭

(సంపు. 3 : పదం. 3౬౧)

అన్నమయ్యగారి రచన

లలితరాగం - రూపకతాళం

[పల్లవి]

(౧) , స స ని ధ ధ | మా ధ ని ధ ధ | , ధ మ ధా ని | సా , , స ని ధ మ |
తె ప్ప గా మ ట్టా కు మీ ద తే లా డు వా డు

(౨) , ధ ని స స రి ని ధ | ధ గా , మ ని ధ ద | , ధ గా మ ని ధ ని | సా స ని ధ మ గ స గ మ |
తె ప్ప గా మ ట్టా కు మీ ద తే లా డు వా డు

(3) ధ ని స స ని సా రి స స ని ధా ధ స | స ని ధ ని ని మ గ మ గ మ ధ మ | ద ని గ గ మ మ ద ధ ని ని
తె ప్ప గా మ ట్టా కు మీ ద తే లా
గ రి | సా , రి స ని ధ మ గ మ ధ ని ‖ స రి
డు వా డు

[అనుపల్లవి]

(౧) , ని స రి సా | ని ని స రి స రి స ని ధా
ఎ ప్పు డు లో క ము లె ల్ల

(౨) , ని స గ రి స సా | స ని స రి స ని ధ మ గ ని
ఎ ప్పు డు లో క ము లె ల్ల

(3) , ని స మ గ రీ , | స ని స రి స ని ధ మ గ మ ధ ని | సా , , , రి స ని ధా మా గ మ గ మా ధ మ ధా |
ఎ ప్పు డు లో క ము లె ల్ల నే లే టి వా డు

(౪) నీ ,, ,, స ని స రి స రి స ని ధా మా | గ మ గ రి స ని స మ గ మ ధ మ | ధ ని (తెప్ప)
నే లే టి వా డు

[చరణం]

, మ గ మ ధ ధ | గ గ మ ధా , | , గ మ ని ధ ధా | ని ధ ధా , మ గా |
మోత నీ టి మడుగు లో ఈత గ ల చిన వా డు

, మ మ మ గ రి | సా ని ధ మ ధ | ని స స మ గ మ ధ మ | గా , , , ,
పాత గి లి నూ తి క్రిం ద బా య ని వా డు

, గ మ ని ధ ధ ని | మా ధ స ని స రి సా | , ని స గా గ | మ గ రీ సా సా రి గ రి ని
మూ తి దో సి ప ట్టి మం టి ము ద్ద పె ల్ల గిం చు వా డు

, రి రి రీ రి | సా ని ధ మ ధ నీ | , నీ స రి ని ధా , మ | గ మ గ రి స ని స రి గ మ ధ ని ‖ స రి (తెప్ప)
రో త మైన పే గు ల పే రు లు గ ల వా డు

ఇట్లే క్రిందిచరణములు :

(౨) కోతికూత నోరివాని - కుఱ్ఱతమ్ముడైనవాడు ;
బూడిదబూసినవాని - బుద్ధులవాడు ;
మాడవన్నె లేడివెంట - మాయల బడినవాడు ;
దూడల నావుల గాచి - దొరయైనవాడు. (తెప్ప)

(3) ఆకసాన బారువారి - అతివలమానములు
కాకుసేయువాడు ; తుర - గముపైవాడు ;
ఏకమై వెంకటగిరి - నిందిరారమణి గూడి,
యేకాలము బాయని - యెనలేనివాడు. (తెప్ప)

లఘుటీక : దశావతారము లుల్లేఖించుట పదవస్తువు.

మోతనీటిమడుగు = ఘోషించు నీరుగల సముద్రము. మత్స్యావతారము ; పాతగిలి = పురాణమూర్తియై ; నూతిక్రింద = సముద్రముక్రింద. కూర్మావతారము ; మూతిదోసి = నోరు ముందరికి చాచి. వరాహమూర్తి ; పేగుల పేరులు = హారములు. హిరణ్యకశిపునివి. నరసింహరూపము ; కోడికూతనోరివాని = అహల్యాజారుడై గౌతముని ఇల్లు వెడలించుటకు అకాలమున కోడియైకూసిన ఇంద్రుని ; కుఱ్ఱతమ్ముడు = చిన్నతమ్ముడు - ఉపేంద్రుడు. వామనమూర్తి ; బూడిదబూసినవానిబుద్ధులవాడు = విభూతిధారియగు పరమశివునివద్ద చదువులు నేర్చిన పరశురామమూర్తి ; మాడవన్నె = బంగారువన్నెగల ; మాయామృగమైన మారీచునిచే వంచితుడు. రామమూర్తి ; దూడల నావుల.. వాడు = బలరామకృష్ణులలో ఎవరైనను కావచ్చును ; ఆకసానబారువారి = త్రిపురాసురుల ; కాకుసేయువాడు = చెఱచినవాడు. బుద్ధస్వరూపము ; తురగముపైవాడు = కల్కి.

ముద్రితపాఠములు : పాతగిలెనూతి ; మూడువన్నె లేడి ; ఆకసానంబారవోలి.

---

# నేటిప్రపంచం

(6-పేజీ తరువాయి)

పెద్దపెద్ద కార్యక్రమాల్ని అమలుజరపడంలో, ముఖ్యంగా ఉక్కుపరిశ్రమని జాతీయం చెయ్యడంలో ప్రభుత్వానికి ఆటంకాలేర్పడవచ్చును. పదిమంది మెజారిటీతో కార్మికపక్షం పార్లమెంటులో ఎంతకాలం తమ ప్రభుత్వాన్ని నిలబెట్టుకో గలదని అనేకులు సందేహిస్తున్నారు. కొన్ని లండన్ పత్రికలు తిరిగి ఈ సంవత్సరాంతంలోగా ఎన్నికలు జరపవలసిన అగత్యం ఉంటుందని వ్రాస్తున్నాయి.

బ్రిటన్‌లో కార్మికపక్షవిజయంవల్ల భారతదేశంతో బ్రిటన్‌వ్యవహారాలలో మార్పుండదు. చర్చిల్‌నాయకత్వాన కన్సర్వేటివ్ పక్షం గెలిచినట్లయితే భారతదేశానికి హాని వాటిల్లేదే. భారతదేశానికి చెల్లించవలసిన స్టెర్లింగ్ బాకీల్ని రద్దుపరచాలని కన్సర్వేటివ్‌లు ప్రచారం చేశారు. భారతదేశంతో వారు విరోధం తెచ్చిపెట్టుకొనేవారే. అందువల్లనే బ్రిటన్‌లో అట్లీ ప్రభుత్వపక్షానికి విజయం లభించిందంటే భారతదేశవాసులు సంతోషించారు.

[సూర్యనారాయణ]

# ఆంధ్రపత్రిక



# ఉగాది సంచిక



ఆంధ్రపత్రిక వికృతి ఉగాది సంచిక సంవత్సరాదికి, అనగా 1950 మార్చి
19 వ తేదికి వెలువడగలదని తెల్ప సంతసించుచున్నాము.

మనోజ్ఞమైన ముఖచిత్రము — వికృతిసంవత్సర పంచాంగము
విషయ సమగ్రమైన ప్రస్తావన — విజ్ఞానప్రదమైన వ్యాసములు
ఆధునిక కవుల పద్యరచనలు — రసవంతమైన కథలు

త్రివర్ణచిత్రములు — ఏకవర్ణచిత్రములు — ఛాయాపటములు

కలిగి, సంచిక సర్వాంగ సుందరముగ వెలువడుచున్నది
డెమ్మి క్వార్టో సైజున కనీసము 150 పుటలు కలిగియుండును.

**వెల రు. 2 లు మాత్రమే.**

మీ సమీపమున గల 'ఆంధ్రపత్రిక' ఏజంటువద్ద గాని మాకు
వ్రాసిగాని వెంటనే మీ ప్రతిని రిజర్వు చేసికొనండి.

పోస్టుద్వారా పంపుటకు ప్యాకింగు, పోస్టేజిలకు అ. 8 లు అదనము.

మీ నేజరు,

ఆంధ్రపత్రిక.

Regd No. M. 4479



Edited, Printed & Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press 7. Thambu ChettySt., Madras